# స్వవిషయము

నవ్యసాహితీసమితి ద్వితీయ ప్రచురణగా శ్రీ పోతుకూచి సాంబశివరావుగారి నాటికలను పాఠకలోకానికి అందచేసే అవకాశం కలిగినందుకు చాలా సంతోషిస్తున్నాము. మొదటి ప్రచురణగా కొందరు సభ్యుల కథానికలను "కదంబం" అనే పుస్తకరూపేణా కొంతకాలంక్రిందట అందజేశాము. 'కదంబం' యెడల పత్రికలు పాఠకులు వెలువరించిన సుహృద్భావాలకు మా కృతజ్ఞత తెలుపుకొంటున్నాము.

ఈ సంపుటిలోని నాటికలు శ్రీ సాంబశివరావుగారి రచనలనుండి సేకరింపబడ్డాయి. వీనిలో చాలావరకు పత్రికాముఖాన, రేడియో ద్వారా యిదివరకే పాఠకులకు పరిచయమయినవి. సాంసారిక రంగంలో అనుదినమూ మనకు తటస్థపడే వ్యక్తులూ సమస్యలూ వీనికి యితివృత్తాలు. పాఠకులు యీ ప్రచురణకుగూడా యితోధికమైన ఆదరం చూపిస్తారని ఆశిస్తున్నాము.

తెలుగు వాఙ్మయాన్ని సర్వతోముఖంగా అభివృద్ధిచేయడానికి కృషిచేయడమే నవ్యసాహితీసమితి అభిలాష. సమితిలో సభ్యులుగా జేరి మా ఆశయసాధనకై మాతో సహకరింపవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

తొలిపలుకును శ్రమ అనుకోక వ్రాసి యిచ్చిన ఆచార్యులు శ్రీ మారేమండ రామారావుగారికీ, ముచ్చటగా అచ్చుపని చేసిన సర్వోదయప్రెస్ వారికి మా కృతజ్ఞతలు.

వేమరాజు నరసింహారావు

29, మే, 1954 కార్యదర్శి.

# తొలిపలుకు

"ప్రతిధ్వనులు" అనే యీ నాటికల సంపుటంలో పది నాటికలు ఉన్నవి. ఇవి శ్రవ్యనాటికలు.

ఈ నాటికల ఇతివృత్తం జీవితంలో ప్రతినిత్యమూ జరిగే వివిధ సంఘటనలు. అందువల్లనే ఒక్కొక్క నాటికనే చదువుతూంటే అందులో చిత్రించబడిన ప్రతి సంఘటనా మనకి చాలా పరిచితం అయినది లాగా అనిపిస్తుంది.

ఈ నాటికలలో పాత్రలుకూడా నిత్యజీవితంలోనివే కావడంవల్ల ఈ యీ వ్యక్తులు మనకు బాగా తెలిసిన మనుష్యులేనే అనే విస్మయం కలుగుతుంది.

భాష వ్యావహారికమే అయినా పేలవంకాక సరళంగా వున్నది.

ప్రతినాటికా రచయిత వ్యుత్పన్నతనీ, భావనాశక్తినీ, మానవజీవిత పరిచయాన్నీ వ్యక్తంచేస్తూన్నది.

ఈ నాటికల సంపుటం సర్వజనాదరణీయం కాగలదని ఆశిస్తున్నాను.

హైదరాబాదు. మారేమండ రామారావు

15—5—1954.

## నాంది

ఈ సంపుటిలోని నాటికలు గత మూడు సంవత్సరాల కాలంలో వ్రాశాను. ఆధునిక నాటకసాహిత్యంలో శ్రవ్యనాటికల స్థానం విశిష్టమైంది. పాత్రల సంభాషణలు ప్రధానంగా రచింపబడిన కథానిక శ్రవ్యనాటికకు ఒక సన్నిహితరూపం. కథానిక ప్రయోజనాలన్నిటితోపాటు ధ్వనిరూప ప్రదర్శన శ్రవ్యనాటిక ప్రత్యేకత. ధ్వనిరూపంలో కుదించిన సంఘటనలు ఒక్కొక్కసారి ఊహాకందని వాస్తవిక చిత్రణ, రసపోషణ పొందుతాయి. అందుకే నేటి సాహిత్యంలో వీటి ఆవశ్యకత, ప్రాధాన్యత పెరుగుతున్నాయి. కనుకనే యీ రచనలు.

ఈ పదినాటికలలో, వితంతువివాహం, తిరుగుబాటు, క్రొత్తరచనలు. మిగిలినవాటిలో కొన్ని ఆలిండియారేడియో హైద్రాబాదువారు ప్రసారం చేశారు. ఆంధ్రపత్రిక, జయభారత్, చిత్రగుప్త, నేత, పత్రికలలో యివి ప్రకటితమయ్యాయి. ప్రథమంగా యీ నాటికలను పాఠకులకు పరిచయంచేసిన పత్రికాధిపతులకు, రేడియోవారికి నాకృతజ్ఞతలు.

ఈ సంపుటి ప్రచురణలో సహకరించిన నవ్యసాహితీ సమితివారికి, తొలిపలుకు వ్రాసియిచ్చిన మారేమండ రామారావు గారికి నా నమస్సులు.

హైద్రాబాదు.
29-5-54.

పోతుకచ్చి సాంబశివరావు

# నాటికలు



* పెళ్ళిపిలుపు
* రెండునాలికలు
* స్వాములవారు
* కాలక్షేపం
* "గృహంలో ప్రజాస్వామ్యం"
* వితంతు వివాహం
* అంత్యక్రియలు
* తిరుగుబాటు
* చుట్టాల రభస
* అద్దెకొంపలో ఒక నెల



## అంకితం

చితికిన నా బ్రతుకులో
చైతన్యం కలిగించి
గతిచూపి పెద్దజేసిన
నా పినమేనమామ
శ్రీ గండికోట రామమూర్తికి.

రచయిత

ADDRESS

MALLIKARJUN REBBA
6-270 SUNKISALA ROAD
VALIGONDA .
NALGONDA 508112

TEL. NO. 254069



1. కలిస్వామి : మాయాపురంలో గృహస్థు.
2. మహాభూతలింగం:
3. భూతలింగం : } కలిస్వామి స్నేహితులు.
4. భవిష్యత్తులింగం : కలిస్వామి మనమడు.
5. గరళకంఠి ; మహాభూతలింగం భార్య.
6. సంతాని : భూతలింగం భార్య.

---

# 1 వ రంగం

భవిష్యత్తులింగం : మహాభూతలింగంగారూ ! ఏమండోయి ! మహాభూత లింగంగారూ (తలుపు తట్టి)

మహాభూతలింగం : ఆఁ ఆ. వస్తున్నాను. (తలుపు తీసి) ఎవరది ?

భ : నే నండి, కలిస్వామిగారి మనమణ్ణి. భవిష్యత్తులింగాన్ని.

మ : అల్లాగటోయి ! నువ్వు కలిస్వామి మనుమడివా ! రానాయనా ! లోపలికిరా. మీ తాతయ్యనిచూసి చాలాకాలమయిపోయింది నాయనా. ఆ చిన్ననాటి రోజులు, అతనితో ఆ స్నేహం తలుచుకుంటూంటే ఎంతో ఆనందంగా వుంటుంది.

భ : మరేనండి. బాల్యస్నేహాలు మరవరానివి.

మ : ఏమిటోయి, పని ! యింతకీ ! రాక రాక వచ్చావు మా యింటికి.

భ : ఏమీ లేదండి. వచ్చే మంగళవారం రాత్రి 12 గంటలకు మా స్వగ్రామం మాయాపురంలో నాకు పెళ్లి జరుపడాన్కి నిశ్చయించారు. నేను యీ ప్రక్కనే శూన్యనగరం లేదండి, అక్కడ

చదువుకుంటున్నాను. మా తాతయ్య నన్ను యింటికి సెలవుపెట్టి రమ్మని వ్రాస్తూ. వారిలోవున్న మీ యెడ్రసు యిచ్చి, స్వయంగా నన్నుమిమ్మల్ని యీవివాహానికిపిలవమన్నాడు. అందుచేతవచ్చాను.

మ : నీకు పెళ్లిటోయి ! ఆహాహా ! నిజంగా పరమానంద భరితుడ నయ్యానంటే నమ్ము. తప్పకుండా వస్తానాయనా ! పెళ్లికి తప్ప కుండా వస్తా. ఒసే ! గరళకంఠి ! గరళకంఠి ! యిదిగో కవిస్వామి మనమ డొచ్చాడే !

(గరళకంఠి ప్రవేశం)

గ : ఎవరండి ! కవిస్వామి ఎవరు ? కవిస్వామి మనమ డెవరు ?

మ : కవిస్వామే ! ఎరగవూ ! నాకు ముఖ్యస్నేహితుడు. అప్పుడప్పుడు నీతో చెపుతూండేవాణ్ణికదుటే !.........అన్నట్టు. నీతో కాదు నా మొదటి పెళ్ళాంతో చెప్పేవాణ్ణి.

గ : (ఏడుస్తూ) ఎప్పుడూ మీ మొదటి పెళ్ళాం, ఆమె బిడ్డలుగురించే శ్రద్ధ. నేను చచ్చానో బ్రతికానో మీకు అక్కర్లేదు.

భ : అదేమిటండీ ! అంత చిన్న విషయానికి అలా విచారిస్తున్నారు.

మ : చూడునాయనా ! నే నన్నమాటల్లో తప్పేమన్నా ఉందా ?

గ : (దెయ్యం పట్టినట్లు నటన - అరుపులతో) తప్పా ! తప్పు కాదూ ! నేనెవర్నో ఎరుగుదువురా ? యింకా నన్నే ఎదిరిస్తున్నావురా ! ఏంచేస్తానో చూడు.

భ : ఆదేమిటండీ ! యిప్పటిదాకా యింతసాఫీగా మాట్లాడుతూ ఒక్క సారిగా యిట్లా మారిపోయారేం ఆవిడ !

మ : అంతే బాబూ! నా అవస్థ ఏంచెప్పమన్నావు. అప్పుడప్పుడు హఠాత్తుగా దీనికి దెయ్యం పడుతూంటుంది. దయ్యంపడితే యింక మనలో మనిషి కాదు.

భ : అల్లాగాండి.

గ : ఏం కుఱ్ఱాడోయి! మా పెద్దమనిషిలా సానుభూతి చూపిస్తున్నావు. నిన్నేం చేస్తానో తెలుసా! మింగేస్తా. (యింకా ఉరుముతుంది)

మ : యిది యిక్కడఉంటే యింకా బ్రహ్మరాక్షసిలా విజృంభించి పోతుంది బాబూ! ఉండు నాయనా! దీన్ని లోపల మా అత్తగారి వద్ద విడిచివస్తా. రా. (బలవంతంగా చెయ్యిపుచ్చుకుని గరళకంఠిని తీసుక్కువెళ్లి లోపల దిగబెట్టివస్తాడు.)

భ : యిదేమిటండీ! మీ భార్యగారికి యిట్టే దెయ్యం పట్టింది.

మ : ఒక గొడవా! ఒక లోకమా నాయనా! ఏనాడైతే పెళ్లి చేసుకు న్నానో అప్పటినుంచీ ఒకటే బాధలు: పీల్చి పిప్పిచేసేస్తున్నా యంటే నమ్ము.... దీనికి ఇల్లాగే దెయ్యం పడుతూంటుంది. యింక ఎంత రణగొణధ్వని అనుకున్నావు. రెండు రోజులదాకా నాకు యింక మనస్థిమితం ఉండదు.

భ : పాపం! చాలా కష్టమే.

మ : అప్పుడు పెళ్లిచేసుకున్నానుగాని! యిప్పుడు నిజంగా పశ్చాత్తా ప్పడుతున్నాను, ఎందుకు పెళ్లిచేసుకున్నానా అని! మొదటి పెళ్లాం నాలుగేళ్లు కాపురంచేసి చనిపోయింది. రెండో పెళ్లాం మూడేళ్లు కాపురంచేసి చనిపోయింది. మూడోపెళ్లాం మరో ఏడాది సంసారం చేసి చనిపోయింది. నాల్గోపెళ్లాం 5 సం॥ లుండి పరమపదించింది.

యింక యీ ఐదవ పెళ్లాంతో తిప్పలు యిల్లా వున్నాయి బాబూ ! యింతింత బాధలు పడతానని తెలుస్తే పెళ్లి మానేసేవాణ్ణి.

భ : పాపం ! మీకు యీవిడ ఐదవ భార్య అన్నమాట !

మ : మరేనోయి ! మొదటి భార్యకు యిద్దరు పిల్లలు పుట్టారు. ఎప్పుడైనా ఖర్మంజాలక, దీనిముందు, నా మొదటిపెళ్లాం, దాని పిల్లల సంగతి మాట్లాడేనా, ఉన్నట్టే ఉండి, హఠాత్తుగా మనిషి మారిపోయి, ఎంతో హంగామా చేస్తుంది. కొందరు అది హిస్టీరియా అంటారు. కొందరు దెయ్యం పీకుతోంది అంటారు. నాకు మాత్రం ఏం పాలుపోటంలేదు బాబు ! ఎప్పుడు యీ సంసారాన్ని విడిచి రామకృష్ణ అనుకుందామా అనిపిస్తోంది.

భ : మరి, ఏ డాక్టరుకైనా, ఏ భూత వైద్యుడికైనా చూపించలేకపోయారా ఆవిణ్ణి.

మ : అన్నీ అయ్యాయి ! డబ్బుఖర్చు ఒక్కటే కనిపిస్తోంది కాని, మనిషి రోగం రోజురోజుకు పెరిగిపోతూంది.

భ : అల్లాగాండి.

మ : యీవిడకు ఏ రోగమూ లేదు. గయ్యాళితనము కాని అని కొంతమంది అంటారు. నాకూ కొంచెం అల్లాగే అనుమానం కూడ. ఏదయితేనేం కాని, నేనుమాత్రం పడే సంసారబాధలు ఒక్క భగవంతుడికే ఎఱుక. తెలియక పెళ్లిచేసుకుంటారుగాని సంసారంలో ఉండే బాధలు యిన్నీ అన్నీ కావోయి.

భ : అల్లాగాండి !

మ : నా గొడవకేం గాని ! పాపం చాల ధూరంనుంచి వచ్చావు. కాస్త

యీ పూట యిక్కడ భోంచేసి వెళ్ళమందామనుకున్నా, యింట్లో యీ గొడవ వచ్చిపోయె.

భ : భోజనం ఎందుకులెండి ! నేను యింకా పిలవవలసినవాళ్ళున్నారు. బయటికి వెళ్లాలి. తప్పకుండా తమరు సకుటుంబ సపరివారంగా పెళ్ళికి రావాలని కోరుతున్నా.

మ : తప్పకుండా వస్తా నాయనా పెళ్ళికి.

భ : మరి సెలవు. వెడతానండి.

## 2 వ రంగం

భ : భూతలింగం గారూ. భూతలింగం గారూ (తలుపు తట్టుతూ)

భూ : ఎవరు వారు. వస్తున్నా. (తలుపు తీసి) ఎవరుబాబు, నువ్వా !

భ : నేను కవిస్వామిగారి మనుమణ్ణి. భవిష్యత్తులింగాన్ని.

భూ : ఓ హోహో ! నువ్వ కవిస్వామి మనమడవటోయి. ఎంతసుదినం యీవేళ. నా ముఖ్య స్నేహితుడి మనమడొచ్చాడే నా యింటికి ! ఆ హ హ ! నాకు నిజంగా ఎంతో సంతోషంగా వుందంటే నమ్మవోయి.

భ : అదంతా మీ అభిమానం.

భూ : ఏమిటోయి విశేషాలు, చాలా అకస్మాత్తుగా వచ్చావు. ఒక వుత్తరం వ్రాయలేకపోయావుటోయి. స్టేషనుకువచ్చి కలుసుకునేవాణ్ణి.

భ : దానికేం లెండి. అసలు విశేషమేమిటంటే, వచ్చే మంగళవారం రాత్రి 12 గం. కు మా స్వగ్రామం మాయాపురంలో నాకు వివాహం జరపడానిక్కి నిశ్చయించారు. మీరు తప్పక రావాలి. మిమ్మల్ని స్వయంగా పిల్చి రమ్మని మా తాతయ్య చెప్పాడు.

భూ : నువ్వు రావడమే ఒక శుభవార్త అయితే, దీనికితోడు యీశుభవార్త తెచ్చావు ! నిజంగా ఏం సుదినమోయి ! యీ వేళ. ఒసీ ! సంతానీ! సంతానీ !

సం : ఆ, ఆ, వస్తున్నా.... ఏమండీ పిలిచారేం !

భూ : చూసేవుటే ! యితనెవరో ఎరుగుదువా ? మనం మాయాపురంలో ఉండేటప్పుడు మన యింటిప్రక్కన కలిస్వామిగారుండేవారు. ఎరుగుదువుగా ! పొట్టిగా, నల్లగా, లావుగా, గుండు, ముళ్ళ చేతికర్ర, రుద్రాక్షతావళం ఆయనకు. జ్ఞాపకం లేదూ !

సం : బాగాఅన్నారు జ్ఞాపకంలేకేమండి ! యింతవర్ణిస్తేకాని తెలియదను కున్నారా.

భూ : ఆయన మనమడితను, భవిష్యత్తులింగం. యితనికి పెళ్లిట మన మంతా పెళ్లివారం.

సం : ఏంచేస్తున్నావోయి నువ్వు యిప్పుడు ?

భ : యీ ప్రక్కనే శూన్యనగరంలో చదువుకుంటున్నాను. యింటికి వెడుతూ, దారిలో మిమ్మల్ని పెళ్లికి స్వయంగా పిల్వమని మా తాత గారు చెపితే యిలావచ్చాను.

సం : నిన్ను చూస్తుంటే ఏదో ఏదో జ్ఞాపకం వస్తుంది నాయనా, (కొంచెం గద్గద కంఠంతో) గుండె తరుక్కుపోతూంటుంది. యింతంత బాధలు అనుభవిస్తాననుకోలేదు జీవితంలో. (కొంచెం ఏడుస్తుంది).

భ : ఆదేమండి ! అలా బాధపడుతున్నారు.

సం : ఏముంది నాయనా, ఒక్కగాని ఒక్క కొడుకు. నీ వయస్సులో వాడు. మొన్న యీమధ్యే హఠాత్తుగా చచ్చిపోయాడు. పిడుగులా

ఉండేవాడు. ఎంతో అందగా వుండేవాడు యింట్లో, కడుపు శోకం దహించుకుపోతూంది బాబు : (వెక్కి-వెక్కి- ఏడుపు)

సం : పోనీ, తక్కినపిల్లలు బ్రతికిఉంటే ఏదో హృదయశాంతిగా ఉండేది. 8 గురు ఆడపిల్లలు పుట్టారు. ఒకళ్ల ఐదేళ్ల, ఒకళ్ల రెండేళ్ల యిల్లా పెరిగి చచ్చిపోయారు. వాళ్లు బ్రతికుంటే యీపాటికి నీ అంత మనుష్యులయ్యేవారు నాయనా. (శోకంతో)

భూ : యీ సంతాన మరణాలు చూస్తూ చూస్తూ భరించలేకుండా ఉన్నానోయి. ఎందుకు పెళ్లిచేసుకున్నానా అనిపిస్తోంది. ప్రక్కని దాని బాధ చూస్తూంటే నా గుండె చెరువవుతోందంటే నమ్ము. నువ్వే కాదు నీలాంటివారి నెవరిని చూసినా "నా పిల్లలు బ్రతికి ఉంటే యింతవారయేవారని" డుగ్గగా ఏడుస్తుంది.

భ : అల్లాగాండి పాపం !

సం : నిన్ను చూస్తుంటే మా చచ్చిపోయిన పెద్దకొడుకు గబుక్కున జ్ఞాపకం వస్తాడోయి. ఏం చెప్పమన్నావు.

భూ : నిజంగా యీ సంసారబాధలు వర్ణనాతీతం. కొనితెచ్చి పెట్టుకున్నట్లుగా ఉంటాయోయి భవిష్యత్తు లింగం.... పాపం చాలాసేపయింది వచ్చి. భోజనాన్కిలేవోయి.

భ : భోజనానికేంగాని నేను వెడతానండి. నేను పిలవవలసినవాళ్లు యింకా వున్నారు. పైగా నేను అధమం రేపటికైనా యిల్లుచేరుకోవాలి. అందుచేత నేను వెడతానండి. మీరు తప్పకుండా వివాహానికి రావాలని మరీమరీ కోరుతున్నా.

భూ: స: మంచిది నాయనా, తప్పకుండావస్తాము.

# 3 వ రంగం

భ : వర్తమానలింగం! ఒరే! వర్తమానలింగం. (తలుపు తట్టుతూ)

వ : వస్తున్నా, (తలుపుతీసి) ఒరే! నువ్వట్రా! భవిష్యత్! రా లోపలికి రా! ఎప్పుడురాక! ఎక్కడినుంచి! ఏమిటి విశేషాలు!

భ : ఒక మంచి శుభవార్త తెచ్చానురా! వచ్చే మంగళవారం రాత్రి 12 గం. మా స్వగ్రామం మాయాపురంలో నాకు వివాహం చేయడాన్కి నిశ్చయించారు. నువ్వు నీ భార్య తప్పక నా వివాహాన్కి రావాలి.

వ : అంత చక్కటి శుభవార్త తెచ్చి అల్లా మెల్లిగా నవుల్తో చెప్తావేరా? అయితే మనకి డిన్నరుమీద డిన్నరు. టీ పార్టీలు అన్నమాట.

భ : మరేమిటనుకున్నావు! నువ్వు తినాలికాని, తింటే ఎంత కావలిస్తే అంతా పొట్ట బ్రద్దలయేటట్లు పెట్టిస్తా.

వ : అయితే అత్తా రేవూరు? కట్నమెంత?

భ : మా వూరే! మాయాపురమే! వాళ్లకు తోచిన కట్నం యిస్తారు. అంతే:....అన్నట్లు మీ భార్య ఏది? పిలు! యీ శుభవార్త ఆవిడకుకూడా అందజేస్తాము.

వ : ఆవిడగారు యిక్కడ వుంటేగా! పుట్టింటికి వెళ్లింది. ఏడాదికి పదకొండు నెలలు పుట్టింట ఉంటానంటే, యింక పెళ్లిళ్లుచేసుకుని సంసారాలు చేయడమెందుకోయి. చదువుకున్న పిల్లకదా అని సరదాగా నే చేసుకుంటే, యిప్పుడు ముప్పుతిప్పలా పెడుతోందిరా.

భ: అరెరె! అలాగా,

వ: ఏడాదికి ఏదో ఒక నెల కాపురం చేస్తుంది. యింట్లో వంటా చెయ్యదు. ప్రత్యేకం ఒక వంటలక్కని పెట్టమంటుంది. ప్రొద్దు న్నుంచి సాయంత్రందాకా, షోకుచేసుకుంటూ, నవలలు, సినీ మాలు, క్లబ్బులు, స్నేహితులతోటి కాలం గడుపుతుంది. అసలు సంసారం అక్కర్లేనట్టుగా సంచరిస్తుందిరా అది.

భ: ఆ అమ్మాయి నీతో B. A. చదువుకుంటూండేటప్పుడు బాగా ఉం డేదికదురా. నువ్వంటే ఏమిటో పడి చచ్చిపోయేది.

వ: అందుకే కదురా మావాళ్లు వద్దంటున్నా పెళ్లిచేసుకున్నది. యీ పెళ్లివల్ల మావాళ్లకా దూరమయ్యాను, పోనీ సంసారం బాగుం దాంటే దీనితీరు యిల్లాఉంది.

భ: యిక్కడ ఉందికాదురా! సంగతేమిటో నేను అడిగేవాణ్ణి.

వ: నీమాట ఒక లెక్క దానికి! నా మాటకే దిక్కులేదు కాని, యిది పల్లెటూరుట. యిక్కడ ఆవిడకేమీ తోచదుట, అందుచేత వాళ్ళ నాన్నగారి ఊరిలో ఉంటుంది అస్తమానం.

భ: యీ విషయంలో తగిన చర్య తీసుకోవాలోయి. ఊరుకోకూడదు.

వ: వాళ్ళనాన్న డిప్యూటీ కలెక్టరట. డబ్బున్నవాడుట, నేను డబ్బులేని దరిద్రుణ్ణిట. B. A. చదువుకుంటున్నపుడు, దానితో కలిగిన స్నేహంవల్ల, మోజు కుదిరి, తలిదండ్రుల్ని కూడా లెక్కచేయ కుండా, నా వాటాలోని 25 ఎకరాల మాగాణి భూమికూడా వదులు కుని, స్వపోషణార్థం యిక్కడ రైల్వేలో గుమాస్తాగిరి సంపా దించుకుని, యింతత్యాగంచేసి పెళ్లిచేసుకున్నానే, దాని కా విశ్వా

సంలేదు చూడు. నేను ఎందుకూ పనికిరానివాణ్ణని అంటుంది యిప్పుడు. ఇవన్నీచూస్తూంటే, ఏమిటీ పెళ్ళిళ్ల అర్థం పర్థంలేకుండా అందులో యీ కాలప్పు అమ్మాయిలని ఎవరు నమ్మమన్నారు, అని ఒక విచారం కలుగుతోందంటే నమ్ము ! భవిష్యత్ ! ఏదో బాగా స్నేహితుడవు కాబట్టి, గుండె విప్పి, నా కష్టసుఖాలు నీ ఒక్క-డితో చెప్పుకుంటున్నాను. హృదయ శాంతికోసం.

భ : నిన్ను చూస్తే జాలివేస్తోందిరా.

వ : ఊఁ మావాళ్లు అడుగుతారు దాని బుద్ధి తిన్నగా ఉందా అని ! లేక పోతే అస్తమానం పుట్టింటిదగ్గర ఉండడమెందుకూ అని, నాకూ అనుమానమే కాని గట్టిగా ఏమనగలం ? (మెల్లిగా) చెప్పుకుంటే సిగ్గుసిగ్గు ! అప్రతిష్ఠ ! యివన్నీ చూస్తూంటే ఏమిటీ పెళ్లిళ్లు ! అని విరక్తికల్గుతోందంటే నమ్ము భవిష్యత్ !......అన్నట్టు నే వాగేస్తు న్నాను నువ్వు భోంచేశావా !

భ : లేదు చెయ్యాలి.

వ : అరెరె ! ఒక పావుగంట క్రితమే భోంచేశాను. యింట్లో స్వయం పాకం. పోనీ కాసేపాగు వండి పెడతా.

భ : అక్కర్లేదు. నీకెందుకురా ఆ శ్రమ హోటల్లో భోంచేసి నేను ఇంటికి వెళ్ళిపోతా. నువ్వు నా పెళ్లికి తప్పకుండా రావాలిసుమా. మరి నే వెళ్లిపోతా.

వ : అల్లాగేరా. తప్పకుండా వస్తాను.

# 4 వ రంగం

(మాయాపురంలో కలిస్వామిగారి యిల్లు)

భ : (స్వగతము) శుభమా అంటూ పెళ్లి చేసుకుంటున్నానని పిలుస్తే, యీ గొడవలన్నీ విన్నానేమిటి ? కొంపదీసి యిది ఏమన్నా అపశకునమా, అనేకమంది పెళ్ళాలు, చచ్చి బ్రతికున్న పెళ్ళానికి దెయ్యంపట్టి ఆ మహాభూతలింగంగారు అలా అవస్థ పడుతున్నారు. పుట్టిన పిల్లలంతా చచ్చి, కడుపుశోకంతో భూతలింగంగారు ఇలా ఏడుస్తున్నారు : మన వర్తమానలింగం చదువుకొన్న పెళ్లాంతో నానా అవస్థలు పడుతున్నాడు. యివన్నీ చూస్తూంటే నా బుర్ర తిరిగిపోతూంది. తీరా నే పెళ్లిచేసుకున్నాక, నా పెళ్లానికి దెయ్యం పడితే, పుట్టిన పిల్లలు చచ్చిపోతే, లేక వర్తమానలింగం భార్యలాగ నా పెళ్లాం నన్ను ఏడిపిస్తే ! అయ్యబాబోయి యీ బాదరబందీ మనకికూడా ఎందుకు ! ఇప్పుడు పెళ్లి మానేస్తే ! ఎల్లాగ వీలవుతుంది తాతయ్య చాలా దేవాంతకుడే !

(కలిస్వామి ప్రవేశం)

కలిస్వామి : ఏమిట్రా భవిష్యత్తు ! ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నావు.

భ : ఏమీ లేదు తాతయ్యా ! పోనీ ఈ పెళ్లి తరువాత ఎప్పుడైనా చేసుకోకూడదా అని ఆలోచిస్తున్నాను.

క : మహాభలేవాడవు ! ఒకమూల బంధువులంతా వచ్చేస్తున్నారు. యింట్లో యింత ఖర్చుపెట్టి హడావుడిచేస్తున్నాము. లగ్నం రేపు

రాత్రి ఆయను. యిప్పుడు పెళ్లిమానెయ్యాలని బుద్ధిపుట్టింది నీకు. మహబాగుంది!

భ: అదిగాదు తాతయ్యా! నాకు పెళ్లి అంటే అదోవిధంగా చికాకుగా ఉంది. తరువాత ఎప్పుడైనా చేసుకుంటే బాగుంటుందేమో అనిపిస్తోంది.

క: ఏడిసేవు: కుజ్జకుంక: నీకేం తెల్సు పెళ్లంటే ఏమిటో! తీరా పెళ్లిసమయాన గొడవ చెయ్యకు బాగుండదు.

(మహాభూతలింగం, భూతలింగం, వర్తమానలింగం, సంతాని ప్రవేశం)

మ: భూ, భూ: ఏమయ్యోయి కలిస్వామి! కులాసాగా ఉన్నావా.

వ: కలిస్వామిగారూ! నమస్కారం.

క: రండి! రండీ. మీకోసమే ఎదురుచూస్తున్నాను. చాల సంతోషం. ఎంతకాలానికి చూశానోయి భూతలింగం నిన్ను! మహాభూతలింగాన్ని చూసి అప్పుడే ఒక పుష్కరం దాటిందనుకుంటా. చాలా సంతోషం యీవేళ. రావోయి వర్తమానలింగం. కూర్చో.........
యిదేమిటోయి! మావాడు యిప్పుడు పెళ్ళి చేసుకోనంటాడు.

వ: అదేమిటి! అదేమిటి! కొంపదీసి ముహూర్తం మార్చేశారా.

మ. భూ: (భవిష్యత్‌తో) తప్పు నాయనా! అలా అనకూడదు.

భ: పెళ్ళంటే నా కేమీ మనస్కరించటంలేదు. నా కిప్పుడు పెళ్లి వద్దండి.

క: యిదిగో యింతమంది పెద్దలముందు ఆ కూతలే కుయ్యోద్దంటున్నాను.

సం : నామాట విను బాబు ! తప్పు ! యిప్పుడు అలా అనకూడదు. ఎప్పుడో ఒకప్పుడు పెళ్లి చేసుక తీరాలి.

భూ : అవును నాయనా ! ప్రతివాడు గృహస్థాశ్రమం స్వీకరించితీరాలి.

క : ఏడిశాడు ! కుట్టుకుంక ! వాడి కేంతెల్సు. అట్లా అంటాడుగాని ఆ మూడుముళ్లు పడ్డాక, మనతో మాట్లాడమంటెమాత్రం వాడు మాట్లాడుతాడటండీ !

మ. భూ. వ. సం : (హహహ) అంతేలెండి.

క : రండి, రండి, లోపలికిరండి. భోంచేద్దురు గాని.

## 5 వ రంగం

(వివాహం. తూతూబాకాలు, ఆశీర్వచనాలు).

## 6 వ రంగం

మ : భూతలింగంగారూ ! వద్దు వద్దంటోనే మనవాడు పెళ్లి చేసేసుకున్నాడు చూశారా.

భూ : ఎవడికోసమండీ పెళ్లి సంఘ నియమం.

వ : వాడు నాతో చెప్పాడండి ! పాపం ! మన సంసారాలు చూసి, తనకికూడ అటువంటి కష్టాలు వస్తాయేమో అని భయ మేసి, పెళ్లి మానేస్తా అన్నాడుట.

భూ : ఆల్లాగా ! విన్నారా ! మహాభూతలింగంగారూ ! పెళ్లి చేసుకోకుండా బ్రహ్మచారిలా ఉండి సుఖపడదామనుకున్నాడు కాబోలు. అందులోఉన్న కష్టాలు అందులో లేవుటండీ !

మ : అయినా నే ఒకటి చెప్తుతా వినండి : మనం పెళ్లిళ్ల చేసుకోలేదూ : మనం కష్టపడుతున్నామంటే, కష్టాలు సహజం. మనలాగే అందరూ పెళ్లిళ్ల చేసుకుని ఏదో కొద్దో గొప్పో కష్టాలు పడుతూంటే, మనకి కొంతమంది తోడుఉన్నారని, కొంత సానుభూతి, హృదయ శాంతి కదుటండీ : : అందరూ పెళ్లిళ్ల చేసుకోడం మానేస్తే పెళ్లి చేసుకున్న మనలాంటివాళ్ల సంఘంలో నవ్వులపాలై పోరూ : అందుచేత మన గృహస్థుల సంఖ్య సంఘంలో అత్యధికంగా ఉండే టట్లు మనం ప్రయత్నిస్తే, మనకి గౌరవం : పైగా ఇది ప్రజా స్వామ్యయుగం కదుటండీ : అధికసంఖ్యాకవర్గము మాటే చెల్లు తుంది : ఏమంటారు.

భూ : మా చక్కాటిమాట సెలవిచ్చారు. సెభాష్. చక్కాటి వేయి వర హాల విలువగల ఊహ.

(కలిస్వామి ప్రవేశం)

క : భోజనాలయ్యాక తాంబూలం వేసుకోకుండా యిట్లా కూర్చున్నా రేమండీ....తాంబూలం వేసుకోండి....ఏ ఆటంకం లేకుండా ఏదో పెళ్లి జరిగిపోయింది....యింక ఎవరి అదృష్టం వారిది....యిదిగో దంపతులు వస్తున్నారు. ఆశీర్వదించండి....రా నాయనా భవిష్యత్ !

మ. భూ. క. వ : (అక్షతలు జల్లుతూ), పుత్రపౌత్రాభివృద్ధిరస్తు, ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిరస్తు, నిత్యకళ్యాణసిద్ధిరస్తు.

---

గమనిక :— 'కవిస్వామి' కాదు, 'కలిస్వామి' అని చదవాలి.

పాత్రలు :

1. సూరిశాస్త్రి.
2. బసవయ్య.
3. కనకమ్మ.

## 1 వ రంగం

బసవయ్య : శాస్త్రిగారూ ! మా అమ్మాయికేమన్నా ఒక సంబంధం చూసి పెట్టారు కాదు !

సూరిశాస్త్రి : చెబుదామనుకుంటూనేఉన్నాను. పామెర్ల వెంకటరత్నం గారి అబ్బాయి ఒకడు యీ వూళ్ళోనే పనిచేస్తున్నాడు. అది నా దృష్టిలో కనిపించే మంచి సంబంధాల్లో ఒకటి.

కనకమ్మ : పామెర్ల వెంకటరత్నంగారా ! మా బావ తోడల్లుడు అన్న గారికి కొంచెం ఆయన దూరపుబంధువు. మంచికుటుంబం. మనం యీ సంబంధంకోసం ప్రయత్నిద్దామండీ.

బ : అయితే అబ్బాయిగురించి వివరాలేమిటండి !

సూ : ఎమ్.ఏ. ప్యాసయినాడండి. పాతికేళ్లుంటాయి.

క : మన అమ్మాయికి పద్దెనిమిదేళ్ళేగా ! చాలా అనుకూలంగానే ఉంటుంది.

బ : అయితే ఉద్యోగమెక్కడ ఆ అబ్బాయికి ! జీతం ఏమిస్తారేమిటి !

సూ : ఏదో కాలేజీలో మేష్టరీ పనట ! మూడువంద లిస్తారుట !

క : యింకనేం ఉద్యోగం చేస్తున్న పిల్లాడు దొరకడం చాలా అదృష్టమండి !

సూ : పిల్లాడుమాత్రం చాలా బుద్ధిమంతుడు ; వినయవంతుడూ కూడ.

బి : మనకి ముఖ్యంగా కావలసిందే అది.

సూ : ఆస్తియేమీ లేదనుకుంటా :

బి : ఆస్తి మనల్ని రక్షిస్తుందటండీ ! పిల్లవాడు బుద్ధిమంతుడై చదువు కున్నవాడైతే చాలదూ :

సూ : తండ్రి యీ మధ్యనే పోయాడు ! పాపం !

క : అయ్యయ్యో ! వెంకటరత్నంగారు చచ్చిపోయారన్నమాట ! నేను ఆయన్ని ఎప్పుడూ చూడలేదు కానండి ! మహా పెద్దమనిషి అని చెబుతారు.

సూ : మామగారు లేరనే ఒక్కలోటే కానండి, ఆయన భార్య మాత్రం మామంచి యిల్లాలు లెండి :

బి : అత్తగారు మంచిదైతే చాలునటండీ ! పదిమంది మావగార్ల పెట్టు.

సూ : అంతేలెండి, మంచి అనుభవంమీద చెలవిచ్చారు.

క : ఏదో మంచిరోజుచూసి ఆ అబ్బాయిని కలుసుకోరాదండీ !

బి : అయితే ఆ అబ్బాయి అమ్మగారు యిక్కడే వున్నారా ! అతని పెళ్లివిషయం మనం ముందు ఎవరితో కదపాలి ?

సూ : వాళ్ళ అమ్మగారు ప్రస్తుతం అతని పెత్తండ్రిగారింట్లో వున్నారుట. యీ మధ్య యీ కష్టంవచ్చాక ఏడాదినుంచి అక్కడే వుంటున్నా రుట. పోనీ : చూచాయగా యీ విషయం ఆ అబ్బాయితోనే కదిపి చూదాం ! పెళ్లికొడుకయితేనేం ! అతనూ వయసువచ్చిన పెద్దమనిషేగా !

క : శాస్త్రి అన్నయ్యగారూ ! రేపు చాలా మంచిరోజండి. మీరుకొంచెం శ్రద్ధచేసి రేపే వెంకటరత్నంగారి అబ్బాయిని చూపించాలి.

సూ : అల్లాగేనమ్మా... అన్నట్టు అతను మంచి కథలుకూడా వ్రాస్తాడటండీ!

బ : యింకనేం ! మన అమ్మాయికి బాగా కాలక్షేపం అవుతుంది. కథ లంటే తెగ చదివేసుకుంటుంటుందండి మా అమ్మాయి.

సూ : పైగా నాటకాలుకూడా వేస్తాడట !

క : మరీ బాగుంది ! మా అమ్మాయికి కొంచెం సినిమాల ఖర్చు తగ్గుతుంది. నాటకాలు యింక ఊరికేనే చూడవచ్చు. ఏమిటో, నాటకాలన్నా, సినిమాలన్నా మహా పెద్ద వెర్రి అండి మాపిల్లకి.

బ : అయితే మా పిల్ల నచ్చుతుందంటారా అబ్బాయికి !

సూ : మీ పిల్లకేమండీ : రత్నాలకోవ. చదువుకున్న పిల్లాడను. అందానికి అందం వుంది. సంసారులకి యింతకన్నా కావలసిందేముందండీ !

క : యీడూ జోడూకూడా బాగుంటుంది.

సూ : బాగుండదటండీ ! పిల్లాడుమాత్రం వరహాలమూట.

బ : కట్నం ఏ మాత్రంలో ఉంటుందంటారు ?

క : సంబంధం స్థిరపడనీయండి. కట్నం ఎలాగైనా సర్దుకోవచ్చు.

సూ : ఇటువంటి సంబంధం పోగొట్టుకోకూడదండి. ఉత్కృష్టమైన కుటుంబం. దీనిగురించి ప్రత్యేకం నే నేమీ చెప్పనక్కర్లేదు.

క : శుభస్య శీఘ్రం అన్నారు. రేపు తప్పకుండా పిల్లవాణ్ణిచూసి, అమ్మాయిని చూపించే ఏర్పాటు చేయించండి.

(హరిశాస్త్రి ప్రవేశం)

ఖ: రండి శాస్త్రిగారూ! మీ మాటే అనుకుంటున్నాం. వెయ్యేళ్లు ఆయుష్షు మీకు.

సూ: మా నాన్నకి యిలాగే ఎంతోమంది దీవనలిచ్చారండీ: కాని ఆయన 40 వ ఏటే తపీమని చచ్చిపోయాడు.

హ: (నవ్వి)....అయితే యింతకీ పండా? కాయా?

సూ: ఏమిటోనండీ! నాకు యిటువంటివన్నీ చూస్తోంటే ప్రపంచం పచ్చి దగా అనిపిస్తోందండీ!

క: అదేమిటండీ! అసలు సంగతి చెప్పండి!

సూ: అతివినయం ధూర్త లక్షణం. నేను యింకా ఏమిటో అనుకున్నాను.

ఖ: పిల్లవాడుకాని ఏమన్నా దురుసుగా మాట్లాడేడా!

సూ: పెద్ద దురుసుతనం కాదండీ! యీ మాత్రం దానికి పిల్లనిచూడటం ఎందుకూ అంట!

ఖ: కొంపదీసి పిల్ల నచ్చలేదన్నాడాండి!

సూ: మరింకేమంటాడు: పైగా కారణం ఏమిటే అని కూడా అడిగాను.

ఖ: ఊఁ.

సూ: నచ్చలేదంటాడేగాని, కారణం చెప్పడు!

క: చూశారా! పిల్లని చూసేటప్పుడు ఎంత దొంగనటన చేశాడో! యింత నటించవలసిన అగత్యం ఏం వచ్చిందండీ! అతని వాలకం చూసి పిల్ల నచ్చిందనుకున్నాను నేను.

హ: నాటకాలు నేర్చినమనిషి ఆమాత్రం వెయ్యడూ!

సూ : మా నాన్నా అన్నాడు

బు : యింతకీ నచ్చకపోవడానికి కారణం చెప్పాలండీ.

సూ : మొదట చెప్పలేదనుకోండి! కాని ఏదో కారణం చెప్పకపోతే ఏం బాగుంటుంది. ఏదో ఒకటి చెప్పి తీరాలి అని అడిగాను. చివరికి అన్నాడు, "పిల్లకి కొంచెం పిల్లికళ్లు" అని. నాకు ఒళ్లు మండిపో యిందనుకోండి.

క : మా అమ్మాయికి పిల్లికళ్లా! అక్కడికి వాడి మొహం బాగున్నట్టు. బొంగు ముక్కూ, పిత్తిగుడ్లూ, పిట్ట మొహం వేసుకుని!

బు : నేను మొదటే అనుకున్నాను, తాటి జంఘన్నలా పొడుగ్గా ఉన్నాడు వీడు. మన అమ్మాయికి ఏం బాగుంటాడా అని.

సూ : యీ సంబంధం చెడిపోయినందుకు ఏం విచారపడనక్కర్లేదు. యింతకీ మొగవాడులేని కుటుంబం.

బు : అన్నట్టు వెంకటరత్నంగారి భార్య, మొగుడు పోయినా నెత్తిన జుట్టు వుంచుకుందిట!

క : రామ! రామ! నలభై ఏళ్లుంటాయనుకుంటా ఆవిడకు. యింకా యీ విలాసమెందుకండీ!.... అయితే ఏడాదినుంచి బావగారి యింట్లోనే వుంటూంది అన్నమాట. కొడుకు యీ వూళ్ళో తిండికి యిబ్బందిపడుతున్నాడనే గొడవే లేకుండా!

బు : అటువంటి కుటుంబం కాబట్టే, యీ అబ్బాయి వెర్రిమొర్రి కవిత్వాలు, రౌడీలాటి నాటకాలు, పట్టుకు వేళ్లాడుతున్నాడు.

సూ: అంతేలెండి నేను ఏమిటో అనుకున్నాను గాని యిది పెద్ద చెప్పు కోదగ్గ సంబంధం కాదండి! యింకా నా చేతిలో లక్షలాది సంబంధాలున్నాయి.

బి: ఆ కుర్రాడికి పాతికేళ్లు. మన అమ్మాయికి పద్దెనిమిదేళ్లేగా! పెళ్లి కుదిర్చేటప్పుడు ఏడేళ్ల తేడా వుండకూడదండి!

క: ఆ అబ్బాయికి ఇరవైఐదేళ్ళ దాకా పెళ్లికానందుకు ఏదో కారణం ఉండేవుంటుంది. కుటుంబంలో యింకా మనకు తెలియని ఏం లోపాలున్నాయో! మనం వెర్రిపీనుగుల్లా పిల్లనియ్యడానికి తయారయ్యేం కాని!

బి: వచ్చిన సంబంధాలన్నీ యిలా తిరక్కొడితే, పిల్ల నెవరిస్తారండి యీ కుర్రాడికి. అందుకే పాతికేళ్ళువచ్చినా పెళ్లికాకపోవచ్చు.

క: పైగా యింకా ఏం చెడుబుద్ధులున్నాయో! పాతికేళ్ళదాకా పెళ్లి చేసుకోనివాళ్లని ఒకవిధంగా మంచివాళ్ళని నమ్మడం కష్టం బాబు!

సూ: కనకమ్మగారి ఊహ నిజంకావచ్చు. రాత్రి 12 గం॥లు, ఒంటిగంట దాక ఆ అబ్బాయి యింటికే రాడుట! వచ్చినా ఒక పట్టున నిద్ర పోడుట కూడా!

బి: యింతకీ పిల్లాడికి కానీ ఆస్తి లేదాయె. సంబంధం చెడినందుకు మరేం బెంగ పెట్టుకోనక్కర్లేదు.

క: యీ చదువులు, ఉద్యోగాలు ఎంతకాలం రక్షిస్తాయండి. ఎంత సంపాదించినా చాలదు యీ కాలంలో, నాలుగురాళ్లు వెనక వేసు కున్నవాడే గొప్పవాడు. యీ సారి మనఅమ్మాయికి ఆస్తి వున్న సంబంధమే చెయ్యండి....అన్నట్టు అసలు వెంకటరత్నంగారు పెంపుడుకదా! చాలా ఆస్తి వుండాలే!

సూ: ఆస్తి అంతా పేకాటల్లో తగలపెట్టాడుట!

జా: తండ్రికి పేకాట! కొడుక్కి వెర్రి మొర్రి రాతలు! నాటకాలు!! వహ్వా! బాగానేవుంది గుణసంపత్తి యీకుటుంబానికి. యిటువంటి పాడు సంబంధం చెడినందుకు విచారం లేదు.

సూ: యితను చాలా పెంకిటంట! తను పట్టినపట్టు నెగ్గితీరాలంటాడుట!

శ: నయం! యిటువంటి మొండి పీనుగని తెలిస్తే, అసలు పిల్లాడి మొహం చూసేవాళ్ళమా! పెళ్ళి స్థిరపరిస్తే గోతిలో దిగేవాళ్ళం.

జా: పోనిలెండి! అంతా మన మేలుకొరకే! యీ సంబంధం యిలా పాడవని తెలిసే, దేముడు దీన్ని చెడగొట్టివుంటాడు.

శ: సంబంధం చెడిపోడానికి నాకొక అనుమానం ఉంది సుమండీ! అమ్మాయిని చూడడానికి వచ్చేటప్పుడు, శాస్త్రిగారు, ఆ అబ్బాయి, అతని స్నేహితుడు ముగ్గురు వచ్చారు. ముగ్గురు కలిసి చేసిన ఏ పనైనా ముక్కలైపోతుందని మొదటినుంచి నేను బాధపడుతూనే వున్నాను.

సూ: నేను ఆ అబ్బాయికంటె ముందు వచ్చేశానండి. ఆ అబ్బాయి అతని స్నేహితుడు కలిసివచ్చేరు అమ్మాయిని చూడటానికి. అందుచేత ముగ్గురు వచ్చేరనే శంక అనవసరం.

జా: అదికాదే! నేను ఫలహారాలు తయారుచేయించవద్దన్నాను. కాని నువ్వే బలవంతపెట్టి అన్నీ చేశావు. మన వంశంలో పెళ్ళి సంబంధాలకి ఫలహారాలు పెట్టే ఆచారం లేదని అంటే విన్నావూ? కతుకుతే అతకదని సామెత ఉందిగా?

క : కాని తెగతిన్నాడు సుమండి ఫలహారాలన్నీ ముంగిలాగ. అంత పిల్ల నచ్చనివాడ్ని ప్లేటన్నీ ఖాళీ చెయ్యమని ఎవడుచెప్పాడండీ? పెట్టింది తిండ మేగాకుండా, పైగా అడిగి వేయించుకొనితిన్నాడండీ!

బ : యిటువంటి తిండిపోతు పెళ్ళానికేం పెడతాడు? సంపాదించిందంతా తనే తినేసి, పెళ్ళాన్ని పస్తులు పడుకోబెడతాడు.

సూ : మా బాగా చెలవిచ్చారు. కాని నాకు కొంచెం చిన్నతనంగా ఉందండి. మీదగ్గర యీ సంబంధంకుదురుస్తానని తీసుకున్న మాట పదహారు రూపాయలు ఖర్చయిపోయాయి గాని. యీ సంబంధం మీకు కుదుర్చలేకపోయానే అని చింతగావుందచే నమ్మండి!

బ : డబ్బు శాశ్వతంటండి. మాట, మంచి, పని, ముఖ్యం. యీ పాడు సంబంధం తప్పినందుకు, మీకు 116 రూపాయలు బహుమానంగా యిచ్చేమనుకోండి.

క : యింతకన్నా మంచి సంబంధాలేమైనా చెప్పండి శాస్త్రిఅన్నయ్యగారూ!

సూ : అలాగేనమ్మా........ వాకబుచేసి మళ్లీ చెప్తాగా! వెళ్లివస్తానండి బసవయ్యగారూ!

బ : మంచిది.

( నిష్క్రమణ )

( వారిలో )

పే : (స్వగతం). ఈ నూటపదహారు రూపాయిలలో పై పదహారు రూపాయలు, పిల్లని చూపించడానికి తీసుకువచ్చిన కుఱ్ఱాళ్ళిద్దరికీ, వెంకటరత్నంగారి కుటుంబం మంచిదని చెప్పినవాడికీ టిఫిను ఖర్చుల క్రింద పంచిపెట్టేస్తే, మనకి యింక నూరు రూపాయలు నికర లాభం!! యీ రోజు మంచి బేరం కుదిరింది. ఏముందీ! నాల్గనాళ్ళు ఏ కుటుంబంలోకైనా వెళ్ళివస్తూంటే యిటువంటి కిటుకులు యిట్టే తెలుస్తాయి. పామెర్ల వెంకటరత్నంగారని ఆ దంపతు లనుకుంటూంటే విన్నముక్కేగా!! ఆయనెవడో మనకేంతెలుసు!! యింతకీ మనకూటికి డబ్బు దొరికింది! నారు పోసినవాడు మరి నీరు పొయ్యడూ!....అంతా దైవమహిమ!!!



పాత్రలు:

1. అళ్వారయ్య : హోటలు యజమాని.
2. అంకమ్మ : అళ్వారయ్య భార్య. దైవభక్తి, మూఢ నమ్మకాలు ఉన్నమనిషి.
3. వెఱ్ఱిపులిగం : అళ్వారయ్య తమ్ముడు. అమాయకుడు.
4. తథాస్తుస్వామి : స్వాములవారు.
5. తందన్నాలు : స్వామివారి శిష్యుడు.
6. బుచ్చమ్మ, బాలమ్మ : పొరుగింటి స్త్రీలు.
7. భిక్షకి - భిక్షకుడు.
8. రంగనాధం : పోలీసు ఆఫీసరు.

## 1 వ రంగం

(అళ్వారయ్య యింటిముందు)

కలికాల కథలన్నీ - బ్రహ్మానందం
కడుపుబ్బ నవ్వించు - నిత్యానందం.

తలచేది నడిచేది - బ్రహ్మానందం
పలికేది వేర్వేరు - నిత్యానందం.

మతములో మర్మాలు - బ్రహ్మానందం
మనిషికి మాయలు - నిత్యానందం.

ఆపెద్దవెలుగులో - బ్రహ్మానందం
అగుపించెపీడలు - నిత్యానందం. కః

బి : అమ్మా! బిచ్చమేయండమ్మా.

వె : చక్కగా పాటలుపాడితే ఎక్కువ బిచ్చమేస్తారనుకుంటున్నావా? దయ చేయమ్మా! దయచేయి. పోనీ నీకు ఎక్కువముష్టి వేస్తామనుకో, వేస్తే మా స్వాములవారిచ్చినంత పుణ్యమైనా యివ్వగలవా?

ఆ : ఏమ్, వెఱ్ఱిపులిగం! ఏమిటా అసందర్భ ప్రలాపం. వెళ్ళమను వాళ్ళని. స్వామివారు చేసేపూజలు పూర్తికానిదే బిచ్చం వెయ్య కూడదని చెప్పు.

వె : ఏం! యింకా నుంచుంటారేం యిక్కడ! వినిపించటంలేదూ ఆమాటలు! అక్కడ మాట్లాడగూడదు, మాటలు వృధా అయిపో గలవు. వెళ్ళండి.

బి : చిత్తంబాబూ!

ఆ : ఏమిట్రా వెఱ్ఱిపులిగం : ముష్టివాళ్ళతో ఎందుకు యీ ప్రసంగాలు.

వె : ఏమీలేదు బాబాయి. స్వామివారు చెప్పారుగా "మితంగా మాట్లాడా లని" అది కొంచెం వాళ్ళకు చెబుతున్నా.

(తందన్నాలు ప్రవేశం)

తం : ఆవ్వారయ్యగారూ : తథాస్తుస్వామివారి పూజ, జపం పూర్తి అయ్యాయి. ఫలహారాలు, నైవేద్యాలు మొదలైనవి తీసుకువచ్చి స్వామివారి దర్శనం చేసుకోవచ్చు.

ఆ : మంచిది బాబూ!

వె : తందన్నాలుగారూ! మాట. స్వామివారు మాయింటికి వచ్చాక క్రమక్రమంగా లావెక్కుతున్నారు! కారణం ఏమిటి?

అ : చఛ ! అదేంమాటలురా ! వెట్టిప్పలగం !

వె : కాదు బాబాయి, నువ్వు రోజూ ఫలహారంగాయిస్తే యిద్దెన్న స్వామివారికి బలం కలిగిస్తున్నావేమోనని కొంచెం అనుమానం కలిగింది.

అ : తప్పు తప్పు ! అటువంటిమాటలనగూడదు.

శా : దానికేముంది. నిజమైన శిష్యులు అవిధంగా ప్రశ్నించి సందేహ నివారణ చేసుకోవచ్చు. మీ యింటికి వచ్చాక స్వామివారు పరిపూర్ణ శాంతితో పూజలు చేస్తున్నారు, దైవకటాక్షంవల్ల వారిలో ఉత్తమ తేజస్సు గోచరిస్తూంది. అందుచే స్వామివారు మునుపటికంటె కొంచెం లావయినారు.

అ : అంతే తండన్నాలూ ! నువ్వన్నమాటల్లో చాలాసత్యం ఉంది. అన్నట్లు మనం అట్టే మాట్లాడగూడదు. మాటలు వృథా అయిపో గలవు.

అ : తండన్నాలూ ! నువ్వు ఏమీ అనుకోకేంనాయనా. అప్పుడప్పుడు మా వెట్టిప్పలగం కొంచెం యిటువంటిమాటలు అంటూంటాడు తెలియక .... స్వామివారి దగ్గరికి యిప్పుడే వస్తున్నామనిచెప్పు.... ఒరే వెట్టిప్పలగం ! మీ పిన్నమ్మను ఫలహారాలు, అన్నీ సిద్ధంచేసి తెమ్మను. స్వామివారి దర్శనం చేసుకుందాం.

వె : మంచిది బాబాయి.

## 2 వ రంగం

వె : పిన్నీ, స్వామివారి దర్శనానికి, బాబాయి రమ్మంటున్నాడు.

అంకమ్మ : ఇదిగో చూడునాయనా, పక్కింటి బాలమ్మగారు, సీతమ్మగారు స్వాములవారి దర్శనం చేసుకుంటామన్నారు. కాస్త వాళ్ళని పిలుచుకురా.

సె : ఇదిగో వాళ్ళే వస్తున్నారమ్మా.

(బాలమ్మ, బుచ్చమ్మ)

బా : ఏమమ్మా ! స్వామివారి దర్శనానికి యింకా వేళ కాలేదూ.

అం : ఇప్పుడే మిమ్మల్ని పిలుచుకురమ్మని పెట్టి పులగాన్ని పంపిద్దామనుకుంటున్నాను.

బు : ఇదిగో అంకమ్మా ! యీ సంగతి విన్నావా ! మన స్వామివారు చాలా గొప్పవాడుట. మొన్న పంటపాలెంలో గుడిలింగయ్య యింట్లో భిక్షకు వచ్చినప్పుడు, వాళ్ళ యింట్లో ఒక బంగారపు గొలుసు పోయిందిట. అప్పుడు స్వామివారిని దానిజాడ ఏమన్నా చెప్పగలరా అని ప్రశ్నిస్తే, కొంచెం కళ్లుమూసుకుని స్వామివారు ఏదోపూజ చేశారుట. గుమ్మన ఆ బంగారపుగొలుసు పూజ పళ్లెంలో కనిపించిందట. స్వామివారి మహత్తుగురించి అందరూ ఆశ్చర్యపోతున్నారు.

బా : ఆ మాత్రానికేమిటి ! కిందటేడు కాకులపల్లెలో వీరభద్ర రామమ్మగారి పెద్దకూతురికి పిల్లలు లేకపోతే, స్వామివారి దర్శనంచేసి, పుత్రసంతానం కావాలని కోరారుట. ఏడాది తిరగకుండా వాళ్ల పెద్ద అమ్మాయికి కాన్పువచ్చిందట.

సె : ఇదిగో ! అట్టే మాట్లాడకూడదు. మాటలు ఎక్కువా అయిపోగలవు. స్వాములవారువింటే కోప్పడతారు.

అం : అందుకే కమటమ్మా ! మావారితో నెల్లాళ్ళు పోరి, పోరి స్వామి వారిని భిక్షకు ఒప్పించాను మా యింటికి. ఈనాటికైనా ఆయనచే ఆ 'తథాస్తు' అనిపించుకుంటే కాస్త పుత్రసంతానంయోగం కల్గుతుం దేమోఅని ఆశ.

నా : అంజమ్మకుకూడా మంచిభర్త లభించేటట్లు స్వామివారిని ఆశీర్వ దించమని కోరండి.

సె : ఇదిగో అట్టే మాట్లాడకూడదు. రండి. రండి. బాబాయి మీకోసం చూస్తున్నారు.

అం : పదండి. మనదగ్గర ఆలస్యమెందుకు. అంజమ్మా ! ఆ ఫలహారాలు ఇలా తీసుకురా అమ్మా !

## 3 వ రంగం

(పూజాగంటలు గణగణ మ్రోగుతుంటాయి)

స్వా : ఓం. నిరాకారస్వామి ప్రత్యక్షసిద్ధిరస్తు. ఓం. నిరంజనస్వామి ప్రత్యక్షసిద్ధిరస్తు. ఓం హ్రీం...ఓం హ్రీం...... తందన్నాలూ ! ఆ హారతిపళ్ళెం యిలా తీసుకురా.

శం : చిత్తంగురూ !

స్వా : ఆశ్వారయ్యా ! అందరూ వస్తున్నారా యిప్పుడు.

శం : వస్తున్నారుగురూ !

స్వా : బాగానే ! వారిని తగువిధంగా ఆసనులువెయ్యి.

శం : చిత్తంగురూ !

(గంటల గణగణ. అందరూ ప్రవేశం)

తం: రండి! రండి! యీ హారతి అందుకోండిముందు. స్వామివారు కొంచెం నిమీలితనేత్రులై ధ్యానంలో ఉన్నారు. యిప్పుడే కలుసుకుందురుగాని.

వె: తథాస్తు స్వామిగారంటే తమాషా! తెగధ్యాన్నం చేస్తారు.

తం: లోపలికి రావచ్చు! రండి.

అందరు: స్వామివారికి నమస్కారం. పరమసేవకులము.

స్వా: తథాస్తు.

వె: అందరూ కొంచెం కొంచెం మాట్లాడండి.

స్వా: అళ్వారయ్యగారూ! మీరు నెల్లాళ్ళనుంచి భిక్షపెట్టూ చాలాగౌరవం చేశారు. నాకు నిజంగా సంతోషంగావుంది.

అ: అదిఅంతా స్వామివారిదయ.

తం: ముఖ్యంగా మీరు ప్రొద్దున్నేయిచ్చే యిడ్లీ కాఫీ ఫలహారాలు చాలా రుచికరంగా ఉన్నాయి అళ్వారయ్యగారు. నా యీ పదేళ్ళ శిష్యరికంలో మా గురువుగారికి యిటువంటి ఫలహారాలు ఎవరూ పెట్టలేదు.

వె: తీవ్రమైన దైవధ్యానం చేసేవాళ్ళకు ఒళ్లు వేడెక్కుతుంది. ఇడ్లెను ఒంటికి చలవచేస్తాయి. కనుక శ్రేష్టమైన ఆహారం. యింక కాఫీ సుఖవిరేచనకారి. ఉత్తమ ఔషధం.

తం: అందుకే మా గురువుగారు నిరభ్యంతరంగా యిటువంటి ఫలహారాలు ఆరగించారు.

స్వా: ఆc! దానికేముంది! దైవము సృష్టించిన వస్తువు దేనినికూడ తృణీకరించకూడదు. సర్వం భక్షణీయం. పైగా సర్వాంతర్యామిలో

లేనముకాబోసే మావంటి స్వాములు రుచులగురించి, ఫలహారాల గురించి ఎప్పుడూ ఆలోచించరు.

తం : అంతేగురూ !

అం : స్వామివారి మనస్సు అతినిర్మలము.

వె : మీరంతా మాట్లాడకండి ! ఒకడు మాట్లాడితే చాలునా !

స్వా : తథాస్తు !

తం : అన్నాయయ్యగారూ ! మీకేమైనా తీరని కోరికయుంటే స్వామివారికి సెలవిప్పించండి,

అం : స్వామివారికి నివేదించుకోవాలని చాలాకాలంనుంచి అనుకుంటున్నా. మా చెల్లెలు అంజమ్మమణికి మంచిభర్త లభించేటట్లు ఆశీర్వదించమని కోరుతున్నా.

స్వా : తథాస్తు ! మా తందన్నాలు చాలా ఉత్తమ శిష్యుడు. అటువంటి ఉత్తమభర్త లభిస్తాడమ్మా మీ అంజమ్మమణికి.

తం : అంతేగురూ !

అం : మరొక్కమనవి స్వామివారికి. మాకు సంతానంలేని విషయం తమకు తెలిసినదేకదా. 'అపుత్రస్య గతిర్నాస్తి' అని పెద్దలు చెప్పారు. తమరు దయయుంచి మాకు సంతానభాగ్యం కలిగేటట్లు ఆశీర్వదించాలి.

స్వా : తథాస్తు ! మా తందన్నాలవంటి ఉత్తమ పుత్రుడు త్వరలో జన్మిస్తాడమ్మా !

తం : అంతేగురూ !

శా : స్వామివారికి నాదొక చిన్నసందేహం. స్వాములు సంతానవంతులు కానివారివద్ద బిక్ష తీసుకోరుగదా, తమరు........

స్వా : నీ సందేహం అర్థమయిందమ్మా. కాని నా తత్త్వమువేఱు. మనిషిలో కావలసినది హృదయనైర్మల్యము. దైవభక్తి. ఉత్తమ బుద్ధి. దైవకృపవల్ల కాని ప్రతివారికి సంతానం కలగదు. అందుచే నాకు అటువంటి ఆటంకాలులేవు.

తం : అంతేగురూ !

బు : స్వామివారు నిజంగా దైవస్వరూపులు.

స్వా : ఆళ్వారయ్యగారూ ! యీ గ్రామంలో మూడునెలల నుంచి గ్రామస్థులు మిక్కిలి గౌరవంతో నాకు బిక్ష పెట్టారు. అందుచేత యీ గ్రామానికి ఒక ప్రత్యేక శుభము కలుగజేసిపోవాలనిఉంది. నాకు చిన్నతనంలో మా గురువు ఒక మణిమంత్రోపదేశం చేశారు. ఆ మంత్రప్రభావంవల్ల రజత సువర్ణాలకు చక్కటి మణిమాణిక్య రూపాలు వస్తాయి. యీ గ్రామస్థుల రజత సువర్ణవస్తువులు మణి మాణిక్యాలుగా చేసి తోటిమానవుల బీదరికంమాన్పి పరమాత్మను సంతోషింపజేయాలని నా కోరిక.

తం : అంతేగురూ !

వె : ఆట్టే మాట్లాడకోయి.

ఆ : తమకోరిక శ్లాఘనీయం. రేపే గ్రామస్థులకు యీ విషయం తెలియజేస్తాను.

స్వా : రేపు పూజానంతరం గ్రామస్థులందరికీ దర్శనమిస్తానని చెప్పండి.

వారి రజత సువర్ణాలు స్వీకరించి ఆ మర్నాడు పూజానంతరం మాణిమాణిక్యరూపాలుగా యిస్తాము.

అం: స్వామివారు తమ అపార కరుణారసము మాపై చిలుకరిస్తున్నారు

వె: అట్టే మాట్లాడవద్దంటంలేమా!

స్వా: యింక తమరు సెలవు తీసుకోవచ్చు. పైవారాధన వేళయింది.

అందరు: చిత్తం (నిష్క్రమిణ)

స్వా: తంపన్నాబా!

తం: చిత్తంగురూ!

స్వా: మనపాచిక పారిందా!

తం: అంతేగురూ!

## 4 వ రంగం

(రంగనాథం, అక్కాపయ్య)

రం: అక్కాపయ్యగారూ! నమస్కారం! మాది బొంబాయి. ఫోంచేస్తుంటే విన్నాను, మీ యింట్లో సువర్ణ రజతాలు మణిమాణిక్యాలుగా మార్చే స్వాములవారు ఉన్నారని. ఒక్కసారి ఆయన దర్శనం చేసుకుని ధన్యుణ్ణి అవుదామని వచ్చాను.

అ: రండి! రండి! దానికేం యీవేళ స్వామివారు అందరికి దర్శనం యిస్తున్నారు. చాలా సద్గుణులు ఆయన........ఇదుగో! ఆయనే స్వాములవారు- నమస్కరించండి.

తం: మంచిది. చూస్తేబాబు లెంపే. వారివద్ద చాలామందిజనం ఉన్నారు. మనం ఆయన కార్యక్రమాలు భగ్నంచేయకూడదు. మరి నే సెలవు తీసుకుంటానండి.

బా: నమస్కారం.

(జనుల కోలాహలం)

అంకమ్మ: నిజంగా స్వామివారి అనుగ్రహం చాలా గొప్పది.

బా: ఎంతెంత జనమమ్మా! సిరగబడి వస్తున్నారు స్వామివారు చిదానందంగా వద్దనకుండా అందరి సువర్ణరజత వస్తువులు స్వీకరిస్తున్నారు.

బా: పాపం! ఆయన ఎంతకష్టపడితే వీరి వస్తువులన్ని మణిమాణిక్యాలుగా మారుతాయో!

బా: స్వామివారిలో ఏం వర్చస్సు! అమృతము! పైగా ఆయన తథాస్తు అన్నది ప్రతీదీ జరిగి తీరుతుందట.

అం: దేనికైనా దైవం అనుగ్రహించాలి.

(అర్ధరాత్రి)

స్వా: తందన్నాలూ! యిక్కడ ఆట్టే వస్తువులు దొరకలేదోయి మనకి,

తం: దానికేంగానిగురూ! ప్రొద్దున్న మీరు యీ వస్తువులన్నీ గ్రామస్థుల దగ్గర స్వీకరిస్తోంటే, ఎవడో ఒకపట్నంవాసంవాడు మిమ్మల్ని చూడాలంటూవచ్చి, బాగాచూసిపోయాడు. నాకు కొంచెం అనుమానంగా ఉంది. మనసంగతి ఏమన్నా బట్టబయలవుతుందేమోనని.

స్వా: అయితే యీ రాత్రి పలాయనం పుచ్చుకుందాం. మూటాముల్లె కట్టు...ఇదిగో? దొడ్డితలుపు మెల్లిగా తీసుకుపోదాంపద. అందరు బాగా నిద్రపోతున్నారు.

శం : పదగురూ ! మనం రేపు యిక్కడఉంటే యింక లాభంలేదు.

(మర్నాడు ప్రొద్దున)

ఆ : వెఱ్ఱిపులగం ! స్వామివారిగది తలుపులువేసే ఉన్నాయి. చూడు ! లోపల కాని స్వామివారు దీర్ఘమంత్ర పునస్మరణలో ఉన్నారేమో !

వె : అలాగే బాబాయి.

ఆం : నిన్నటి గ్రామస్థులంతా ఒక్కొక్కరూ వస్తున్నారండి. యీవేళ ఎంతో సంతోషిస్తారు. వాళ్ళ మణిమాణిక్యాలు చూసుకుని.

(జనుల కోలాహలం కారాబూరు ధ్వని)

ఆ : వెఱ్ఱిపులగం ! మన యింటిముందు కారాగినట్లుంది చూడు ఎవరో !

వె : బాబాయి ! (భయంతో) పోలీసులు ! పోలీసులు !

ఆ : పోలీసులే ! హాయిబాబోయి ! పోలీసులే ! ఎందుకువచ్చి వుంటారు.

(రంగనాథం, పోలీసులు ప్రవేశం)

రం : ఏమండీ ! ఆ స్వామివారిని చూపిస్తారూ !

ఆం : ఈవేళ గదినుండి యింకా బయటికి రాలేదండి స్వామివారు. పూజలో ఉన్నారనుకుంటాను.

రం : (పోలీసులతో) తల్పులు తీయండి. ఊ........ యీ స్వామిని ఎట్లా నమ్మేరండి ! వీడు ఒట్టి దొంగ.

ఆ : హయ్యబాబోయి ! అల్లాగటండీ ! యింకేముంది.

(తలుపులు బ్రద్దలయిన శబ్దము)

పె: బాబాయి: గదిలో స్వామివారులేరు. తందన్నాలూలేడు. యింట్లో ఒక్కసామానుకూడాలేదు.

(జనుల కోలాహలం)

రం: హాఁ పరారి అయ్యారు. తిరిగి ఆకథే యిక్కడా జరిగించన్నమాట.

ఆ: అసలుసంగతిఏమిటి రంగనాథంగారూ!

రం: యీ స్వామి అసలుపేరు సుబ్బరామయ్య. వాడి శిష్యుడిపేరు సీతన్న. వాళ్ళిద్దరూ బాగా చదువుకున్నవాళ్ళే. కాని ఉద్యోగాలు దొరకక, అమాయకులైన యీ గ్రామస్థుల దగ్గరికివచ్చి మోసం చేస్తున్నారు. యిదేవిధంగా మొన్న మా రాష్ట్రంప్రక్కనే జరిగింది. అప్పుడు పోలీసురిపోర్టు యిచ్చారు. అప్పటినుంచి రహస్యాన్వేషణ చేస్తూ అతన్ని యిక్కడ చూశాను. పట్నంవెళ్ళి పోలీసులను తీసుకు వచ్చేసరికి వీళ్ళు పరారి అయారు.

(కోలాహలం)

ఆ: ఇప్పుడేంచేసేది.

రం: ఏం చేస్తారు! ఆ జనాన్ని ముందు సమాధానపరచాలి. ఇదిగో వినండి.........మీరు స్వామివారికి యిచ్చిన వస్తువులజాబితా నాకివ్వండి. అతన్ని ఏవిధంగానైనా పట్టుకుని మీ వస్తువులు మీకు యిప్పిస్తా.

(కోలాహలం)

అం: దేవుడా! ఎంత మోసం! ఎంత మోసం! స్వామి ఇంత దొంగవాడని మనం ఎప్పుడూ అనుకోలేదు.

వె: హాహాయి! మన్ను నెల్లాళ్లనుంచి పెట్టిన ముద్దెన్నన్నీ వృథా అయి పోయాయి. పైగా మనయింట్లో వెండిపళ్ళాలు మాయమై పోయాయి.

అం: అదంతా మనఖర్మంరా నాయనా.

అ: చాల్లే! నోరుమూయ్యి. యిదంతా నీమూలానే. అయినా ఆడదాని మాట వినమని ఎవడు చెప్పాడు! బుద్ధి తక్కువవచ్చి విన్నా. ఖర్మ అనుభవించాలి.

తలలన్ని నునుపైన - బ్రహ్మానందం
తత్వంబు తెలియునా - నిత్యానందం.

మంత్రాలమాటులో - బ్రహ్మానందం
తంత్రాలు దాచారు - నిత్యానందం.

ఆపెద్దవెలుగులో - బ్రహ్మానందం
అగుపించె నవ్వులు - నిత్యానందం.

పరమాత్మలీలలు - బ్రహ్మానందం
జీవాత్మరూపులు - నిత్యానందం.

ప్రదేశం: తడికలపల్లి గ్రామం.

పాత్రలు:

1. మూర్తెమ్మ : ఆ గ్రామంలో నివసిస్తున్న ఒక సనాతన వితంతువు.
2. కీర్తిరాజు : మూర్తెమ్మ కొడుకు.
3. కలందమూర్తి } పొరుగింటి భార్యాభర్తలు.
4. తిరవమ్మ
5. బ్రహ్మానందశాస్త్రి } పొరుగింటి మరొక జత.
6. చెకుముకిమణి

## 1 వ రంగం

(మూర్తెమ్మ వత్తులుచేస్తూ పాడుతూంటుంది.)

ఏపాతచేతలో - గోవిందారామ
నారాకపాలాయె - గోవిందారామ

కర్మపరిపక్వంబు - గోవిందారామ
కలిసిరావాలోయి - గోవిందారామ

పెట్టిపుట్టనిదె - గోవిందారామ
బ్రహ్మైన మనలేడు - గోవిందారామ

ఈజగతిమిథ్యయే - గోవిందారామ
ఈశ్వరునిమాయయే - గోవిందారామ. ఏ॥

కాపురం చేస్తేగా! మొన్న నేవిన్నదేమిటంటే అత్తగారింట్లో ఏవో చెడుగా నడిచిందనీ, అందుచేత భర్తకు కోపంవచ్చి పుట్టింట విడచేశాడనీ, మంగయ్యగారు పాపం అల్లుడికి అనేక ఉత్తరాలు వ్రాస్తున్నాడని విన్నాను.

శా: ఆ మంగయ్యగారి అమ్మాయికి ఎంత గర్వమనుకున్నావు తనొక్కర్తే చదువుకున్నదని ఎంతో పొగరు! ఇంక దానితల్లి పలకరించినా మాట్లాడదమ్మా!

సూ: మరే...సరేగాని మీ చెల్లెలికి పురుడు వచ్చిందా చెకుముకీ!

శా: అదేమదృష్టమో కాని, దానికంతటా మొగవాళ్ళే పుడుతున్నా రమ్మా! యీ మూడోకాన్పుగూడ మగవాడేనట! నాకు మాత్రం (విచారంగా) యీ ఆడసంతానం తప్పేమార్గం కనిపించటంలేదు.

సూ: ఏముంది! ఒకసారి తిరపతికి వెళ్ళి మొక్కుకో! ఒక మగ పిల్లవాడు పుడతాడు.

శా: ఇంక అదేచేయాలి....అన్నట్టు. మన తిరపమ్మకి, మంగయ్యగారి కూతురుకూ చాలస్నేహం పెరిగినట్టుగావుంది: యీ మధ్య తెగ రాసుకు తిరుగుతున్నారు.

సూ: ఆఁ యిదెంతకాలంలే! మూడునాళ్ళ పట్టుపగలు! రెండురోజుల్లో దెబ్బలాడుకోకపోతే నే చూస్తాగా! ఆ తిరపమ్మ ఓ పట్టాని ఎవరితోనైన దెబ్బలాడకుండా వదిలిందా?

శా: నేనంటే దానికి పీకదాకా కోపమమ్మా, అదేమిటోగాని!

సూ: అలాగా!....ఊఁ....మీ ఆయన ఊళ్ళో ఉన్నారా?

చె : లేకేం ! ఆయన కచేరీకి పదిగంటలకు వెళ్ళిపోయాడు. నేను యిలా వచ్చాను. యింట్లో కూర్చుంటే ఏమిటో ఏమీ తోచదమ్మా !

మూ : అంతకేకము లే ! నేను కూడా ఏవో కాలక్షేపానికి వత్తులుచేయడం మొదలుపెట్టాను, పైగా లక్షవత్తులవ్రతం కూడా చేద్దామను కుంటున్నాను.

చె : అయితే పిన్నీ : నువ్వు ఎన్ని వ్రతాలు చేశావు ?

మూ : చాలా చేశానమ్మా ! పళ్ళ వ్రతాలు చేశాను. పువ్వులవ్రతాలు చేశాను. పిండివంటల వ్రతాలు చేశాను. చూశావు ! రెండు నెలల క్రితం గారెలనోముచేశాను. జ్ఞాపకముందీ !.... అప్పుడు మా చెల్లెలు వెంకమ్మకూడా యిక్కడవుంది కదూ ! అది తెలియక, ఏకంగా నాల్గు కుంచాల మినుములు నానేసింది. ఆ పళంగా బోలెడు గారెలు తయారయ్యేయి. ఎంతమందిని పిలుస్తే అవి చెల్లుతాయి ! అప్పుడు యీ తిరపమ్మ మొగుడు కబంధమూర్తి లేడూ ! అతన్ని కూడా పిలిచాను. అతను తిన్నాడే గారెలు ! ! ఎన్నివందలు తిన్నాడనుకున్నావు ! ! ! అంత చిన్నపొట్టలో యిన్ని గారెలు ఎలా యిమిడాయో అని ఆశ్చర్యం ! మొత్తంమీద ఆ మహానుభావుడివల్ల నానోము పూర్తయింది.

చె : అంతేలే ! ఆ కబంధమూర్తి ఉత్తి తిండిపోతు.

మూ : తిండిపోతేకాదు, బడుద్ధాయికూడా.

చె : బడుద్ధాయేకాదు, వట్టి మొండిఘటం కూడాను.

(తిరపమ్మ రాక)

తి : (తలుపుతట్టి) మూర్తెమ్మత్తా ! తలుపుతీయి !

సూ : ఆఁ ఆఁ....వస్తున్నాను. (రహస్యంగా) తిరపమ్మలాగుంది. చాల్లే యింక మాట్లాడకు. అది విందేమో కొంపదీసి. ఎరగనట్లుఫుండు; ఫరవాలేదు... (తలుపుతీసి) ఏమమ్మా తిరపమ్మా : యీమధ్య రావడమే మానేశావు !

తి : యింట్లోపనులు ఎక్కువయ్యేయి. అందుచేత...

సూ : యింట్లోపనులెవరి కుండవు ? అందరికీ ఉంటాయి. పాపం ! మా చెకుముకినిచూడు, నన్ను చూడనిదే ఒక్కరోజుకూడా ఉండలేదు.

చె : నేను పళ్ళివస్తా పిన్నీ. కొంచెం పనుంది.

సూ : సరే నీయిష్టం.

(చెకుముకిమణి నిష్క్రమణ)

తి : యిదేమిటమ్మా ! నేను ఎక్కడికివస్తే అక్కడినుంచే వెళ్ళిపో తుంది యీ చెకుముకి మణమ్మగారు ! !

సూ : అంతేలే ! దానిగుణమే అంత ! ఒకళ్ళతో దానికి పొత్తు చచ్చేదిసిం దేమిటి !...ఏమిటో నువ్వంటే మరీ యిదయిపోయి రుసరుస లాడుతుందే !

తి : కొంపదీసి నన్నుగురించి ఏమన్నా చెపుతోందా ?

సూ : నిన్నుగురించి కాదనుకో. మీఆయనగురించి.

తి : ఆఁ....ఏమంటోందేమిటి ?

సూ : ఉత్తి బడుద్ధాయి. మొండిఘటం. తిండిపోతు; అంటుంది.

త్రి : దాని మోహం మండ ! వాళ్ళ ఆయన మహా బాగున్నట్టు. పీలగా, సన్నగా, పృష్టం దాకా వేలాడే ఆ పిలక ! ఆ..... ఆయనగురించే వర్ణించుకు మురిసిపోవాలి !

మూ : కొంచెం లావుగా నల్లగా ఉన్నంతమాత్రాన అలా మీఆయన్ని అనవసరం బాగులేడు అనికూడా చెప్పాను.

త్రి : అల్లా చెప్పినా వినలేదన్నమాట యీసారి కనుపించనీ, మా ఆయన సంగతి అటుంచి, వాళ్ళ ఆయన ఏమంతా అందంగా ఉన్నాడో కనుక్కుంటా !

మూ : పోనీలే దానికేంగాని.... ఆ మంగయ్యగారి రెండవ కూతురు వస్త్రిలో చదువుకుంటూ సెలవలకీ యింటికి రావటంలేదు. ఏమిటి సంగతి ?

త్రి : అక్కడ స్నేహితులతో కలిసి అవేవో, పిక్నిక్కులట, పెద్ద పెద్ద పట్టణాలకువెళ్ళి అవేవో గొప్పగొప్పవి చూస్తారుట !!... అయినా మనకెందుకులే ఆ గొడవలన్నీ !

మూ : ఏమిటోనమ్మా ! యీ మాటలన్నీ మాకాలంలో ఎప్పుడూ వినలేదు. వయసువచ్చాక పెళ్ళి చేసుకుని భర్తతో కాపురం చెయ్యటంతప్ప, ఏమీతెలియవు మాకు.

త్రి : అంతేలే !... కానీ మూర్తెమ్మత్తా ! మీ అబ్బాయికి యింకా పెళ్ళి చెయ్యలేదేమమ్మా ! అప్పుడే పాతికేళ్ళు వచ్చాయికదూ !

మూ : నేను చెబుతూనే ఉన్నాను. వినటంలేదమ్మా ! ఏమిటో ఎప్పుడూ చదువంటూనే వుంటాడు. ఎప్పుడూ ఏవో వ్రాస్తూనే వుంటాడు. తిండైనా సరిగా తినడమ్మా !

తి: కాని మీ అబ్బాయి చాల బుద్ధిమంతుడు. మరొకర్తైతేనా ఆ వయసులో ఉన్నందుకు......

మూ: మరే! ఎన్ని అపకతవ పనులు చేయాలిసింది!!

తి: కాని నేనెప్పుడుచూసినా బుర్ర వంచుకునే నడచిపోతాడమ్మా!

మూ: అది వాడి సహజగుణం.

(కీర్తిబాబు ప్రవేశం)

కీ: (తలుపు తెరిచి) అమ్మా! అమ్మా!

తి: మీ అబ్బాయి లాగుంది...! తలుపు తీయమన్నారేమిటి?

మూ: నీకెందుకులే ఆశ్రమ! నేతీస్తాగా!!

కీ: (హడావిడిగా) అమ్మా! అన్నంపెట్టు పనుంది బయటికి వెళ్ళిపోవాలి.

తి: నేవెళ్ళివస్తానమ్మా! మళ్ళొస్తా!

మూ: మంచిది. అప్పుడప్పుడు కనిపిస్తూఉండు.

తి: అలాగే! (నిష్క్రమణ)

కీ: అస్తమానం వచ్చేవాళ్లు వెళ్లేవాళ్లు. ఈ యిల్లు ఈ వూరికి ఒక క్లబ్బుగా మార్చవల్చుకున్నావా? ఎందుకూ పనికిరాని ఆ కబుర్లెందుకు. కృష్ణారామా అంటూ ఆ భాగవత రామాయణాలు చదువుకోకూడదమ్మా!

మూ: చాల్లేరా! అస్తమానం చదువో చదువో అంటావు. నాకెందుకూ ఈ చదువులన్నీ యిన్నేళ్లువచ్చాక. యింతకే వేముణ్ణి తలుచుకుంటూ గోవిందారామ పాటలు పాడుకుంటున్నానుగా!

కీ. రేపు మీరంతా వెళ్ళిపోతారనుకుని. కారణం నువ్వని మీదకువచ్చి అల్లరిచేస్తారు వాళ్ళ గొడవలలో అనవసరంగా నువ్వు కలుగ జేసుకోకు!

మూ: నాకు తెలియదేమిటిరా! నువ్వు నాకు ప్రత్యేకం చెప్పాలా?

కీ: యిటువంటి పెళ్ళాటలు ఎన్నిసార్లు కాలేదు! ఈసారి యిటువంటి కొట్లాటలు కనిపించవని! చెప్తాను!

మూ: వాళ్ళే నీ తెలివితేటలు! అయినా మా పెద్దవాళ్ళ విషయాలు నీకెందుకు? నువ్వు భోంచేసి బయటికివెళ్ళు.

## 2 వ రంగం

(కబంధమూర్తిగారింట్లో, రాత్రి పదిగంటల సమయం. కబంధ మూర్తి చేస్తూవుంటాడు)

లి: ఏమండోయి!

క: ఏమిటే?

లి: (గట్టిగా) విన్నారా యీ సంగతి!

క: ఏం. చెముడనుకున్నావా! వింటున్నా.

లి: మీకు చెముడనికాదండీ. అసలు ఈసంగతి ......

క: ఏసంగతి! చెప్పకుండా ఎలావింటా?

లి: బాగుంది!... ఆ చెకుముకిమణి ఎంత సంగనాచిదనుకున్నారు.

క: అప్పతే అవవచ్చు.

లి: అబ్బ! అదికాదండి! మిమ్మల్ని అనేక మాటలంటూందిట.

క: మంచిగానా! చెడ్డగానా!

తి : మంచివాతే, యీ అర్ధరాత్రి రహస్యంగా చెప్పడమెందుకండీ: పెద్దకాబట్టే....

క : ఏమంటుందేమిటి :

తి : మీరు తిండిపోతని...

క : అందులో అబద్ధంలేదే: నిజంగా, అందరికంటే నేను కొంచెం జాస్తిగానే తింటాను.

తి : అబ్బ !... మొండిఘటమనికూడా.......

క : అవుతే అవవచ్చు. నేను ఒకపట్టాని ఎవరినైనా లెక్కజేస్తేగా :

తి : (విసుగు కోపంతో) బడుద్ధాయి అనికూడా అంటూందిటండీ !

క : ఆఁ... అల్లాగా : : అయినా నే చదువుకోలేదుగా : తప్పేముంది అందులో.

తి : అయ్యోరామ : ఆ మాటల్లో అర్థం మీకు తెలియటంలేదండీ !

క : నీకు పెద్ద తెలిసేపోయిందిలే : :

తి : యీమాత్రం అర్థంచేసుకోకపోతే ఎందుకండీమీరు....

క : చాలు చాల్లే. పడుకో. నాకు నిద్రవస్తూంది.

తి : మీరు ఎప్పుడూ యింతే.

(కాసేపటికి కబందమూర్తి గురుకశబ్దం వినిపిస్తుంది.)

## 3 వ రంగం

(అదేసమయంలో, చెకుముకిమణి యింట్లో బ్రహ్మాండశాస్త్రి భోజనం ఎక్కువచేసి ఆయాసపడుతూంటాడు.)

చె : ఏమిటండీ : యీమాత్రపు భోజనమే అరగకుండా ఆయాసపడితే ఎట్లాగండీ :

ప్రి: ఆఁ తెలుసుకుంటా! నా శకీరత్వం నీకేమి తెలుసూ!

చె: అయ్యో రామ! యిన్నాళ్లు కాపురం చేసినదాన్ని నాకామాత్రం తెలియదటండీ.

ప్రి: ఆ. ఆఁ తెలుసులే! ఆ తాంబూలం యిలాఇయ్యి. అన్నం కొంచెం ఎక్కువైనట్టుంది.

చె: యిదిగో... మాకారూ! ఆ కబంధమూర్తిగారి యింటావిడ యింతా అంతా మనిషి కాదండి.

ప్రి: అందరూ ఒకలాగా ఎందుకుంటారు?

చె: మిమ్మల్ని అనేక మాటలంటూందిటండీ!

ప్రి: నీ కెవరు చెప్పారు?

చె: సాయంత్రం మూర్తెమ్మ పిన్నిగారింటికి బొగ్గులు పుచ్చుకుందామని వెడితే చెప్పిందండి!

ప్రి: యింతకీ ఏమంటోంది?

చె: మీరు సన్నగా పీలగా వృక్షందాకా పిలక వేసుకు ఉన్నారంటుంది.

ప్రి: యిందులో అబద్ధం లేదుగా!

చె: అబ్బ! అబద్ధం లేకపోవచ్చు. మిమ్మల్ని అలా హేళనచేస్తే మీరు ఊరుకుంటారా?

ప్రి: లేనిది ఉందంటే ఊరుకోకూడదుగాని, వున్నది వుందంటే ఊరుకోక ఏంచేస్తాము?

చె: బాగుంది. మీ వితండవాదనకు ఎవరూ సమాధానం చెప్పలేరు.

ప్రి: అందుకే నన్ను బ్రహ్మానందశాస్త్రి అన్నారు.

పె : అఁ.... మిమ్మల్ని మీరే పొగడుకోవాలి.

బ్ర : ఆ తిరపమ్మగారు కూడా పొగడుతూందిగా ! ఫరవాలేదు.

పె : ఎప్పుడు మీరు యింతే ! ఏమాటా అర్థంచేసుకోరు.

బ్రి : వాల్ వాల్లే ! నిద్రపో, అట్టే గొడవపెట్టక.

# 4 వ రంగం

(మర్నాడు సూర్యోదయం ముందు, కబంధమూర్తిగారి యిల్లు బ్రహ్మాండశాస్త్రిగారి యిల్లు ఎదురుగా ఉంటాయి. మూర్తెమ్మయిల్లు ఆ ప్రక్కనే వుంటుంది. బ్రహ్మాండశాస్త్రి వీధి అరుగుపై ముఖం కడుక్కొంటాడు. తిరపమ్మ చెకుముకిమణె వారియింటిక్లె కెదురుగా శుభ్రం చేసుకుంటూ, ముగ్గులు పెట్టుకుంటూంటారు....ముఖం కడుక్కొంటున్నప్పుడు నీళ్ళు పడుతున్న శబ్దాలు.)

బ్రి : ఏమండోయి ! కబంధమూర్తిగారు, కళ్ళు నులుపుకుంటూ వస్తున్నారు ! యిదేనా లేవడం ?

క : మరేనండి. యీవేళ కొంచెం ఆలస్యమయింది లేవడం. రాత్రి సుఖభోజనం ఎక్కువచేసి నిద్రపోతే ఒక పట్టాని మెలకువ రావండి. మీరు నాకన్న ముందు లేచారే !

బ్ర : అవునండి. అన్నం కొంచెంతిన్నా నాకు అరగదండి ! కించిత్తు అజీర్ణబాధఉంది. అందుచేత రాత్రి ఒక పట్టాని నిద్రపట్టక పెందరాడే మెలుకువ వచ్చేస్తుంది.

తి : ఏమమ్మా ! మా యింటిముందు మేం శుభ్రం చేసుకోగలము. యిక్కడదాకా ముగ్గులు పెట్టనక్కరలేదు.

చె: నీ యింటిముందెవరొచ్చారు. ఇదంతా మా యింటిముంగలే!

తి: ఏం సంగనాచివే! చాలా తెల్వితేటలు చూపిస్తున్నావే!

చె: నువ్వు ఇంతా అంతా మనిషివా! నీ గయ్యాళితనం ఎవరికి తెలియదు.

తి: నన్ను గయ్యాళి అంటావటవే! నువ్వు పెద్ద వినయవతి అయి నట్టు....! చూశారా (భర్తతో) ఏమండోయి! అనవసరంగా యావిడ ఏమంటోందో నన్ను! మిమ్మల్ని అనరాని మాటలుఅని నన్నుకూడా గయ్యాళి అంటోందండి.

త: అది సహజంలే. ఆడవాళ్ళు అట్లానే అంటుంటారు.

చె: మీ ఆవిడకే అల్లా అనడం సహజం...ఏమండీ (భర్తతో) మీరు చూస్తూ అలా ఊరుకుంటారేం. వాళ్ళ ఆయన అనవసరంగా నాతో పెట్లాడుతుంటే!

త్రి: ఊష్ ఊరుకుందూ!... కబంధమూర్తిగారూ వాళ్ళా వాళ్ళా అనేక మనుకుంటారు, మనకెందుకు?

చె: మీకు కాకపోతే యింకెవరికి కావాలండి! అనరానిమాటలు అ తిడుతున్నా, మిమ్మల్ని అందిగదా! అసంగతికూడా ఏమిటో కనుక్కోండి!

తి: నేనేమన్నానమ్మా! యిది మరీ బాగుంది.

చె: బాగుందడూ! ఆయన సన్నగా పీలగా పృష్ఠంచాకాపిలక వేసుకుని ఉన్నారా? యివి అనవలసిన మాటలేనా పెద్ద మనుష్యుల్ని?.... నాకు మూర్తెమ్మపిన్ని చెప్పిందిలే!

తి : పైగా యిదో నేరమా! మా ఆయన్ని నువ్వు తిండిపోతు, బద్ధకపు, మొండిఘటం అని అనలేదా!

చె : యీ అబద్ధాలన్నీ యెక్కడ నేర్చుకున్నావమ్మా?

తి : అబద్ధాలా? ఋజావు యిప్పించనా?.... మూర్తెమ్మత్తా! మూర్తెమ్మత్తా... యిలారా ఒకసారి!

(మూర్తెమ్మ ప్రవేశం)

మూ : ఎందుకే పొద్దున్నే పిలుస్తున్నావు?

తి : మాఆయనగురించి చెకుముకి నానా మాటలు అనలేదా?

మూ : ఏమిటర్రా! యీ కొట్లాటలు! అవ్వ! పొద్దున్నే ఎవరైనా వింటే నవ్వుతారు.

చె : మాఆయన్ని యీ తిరపమ్మ.... "సన్నగా, పీలగా, పృష్ఠందాకా పిలక" అని హేళన చేయలేదా!

మూ : ఊరుకుందురు! అనవసరంగా యీ కొట్లాటలెందుకు!

చె : (భర్తతో) ఏమండీ! ముంగి ముషాణంలా అలాచూస్తూ నుంచుంటారేం!

తి : (భర్తతో) ఏమండీ! అంతంత మాటలంటూంటే ఆ మాత్రం పౌరుషంలేదు?

క : ఏమండోయి! బ్రహ్మాండశాస్త్రిగారూ! యిల్లా అనడం బాగులేదు. కొంచెం మీ ఆవిడని కూకలేయండి.

చె : ఏమండి (భర్తతో) వాళ్ళ ఆవిడని ఆయన వెనుక వేసుకు వస్తూంటే, మీకు అమాత్రం పౌరుషంలేదూ!

ప్రి: మా ఆవిడ తప్పు యిందులో అస్సలు కనిపించటం లేదండీ! మీరే మీ భార్యగారిని కొంచెం సముదాయించండి!

శ్రీ: మాటా ఆతప్పు నాదిట, మొదట మా ఆయనగురించి ఆ ఏకుముకి నానామాటలు అంటూంటేనూ, నాకు కోపంవచ్చి, నేను నాలుగుముక్కలు వాళ్ళ ఆయనగురించి అన్నాను.

చె: నేనేమన్నా నమ్మా! సుబ్బు యింతా అంతా మనిషినా!!

క: ఏమండీ! శాస్త్రిగారూ! మీ ఆవిడదే ముందు తప్పుగా కనిపిస్తుంది.

ప్రి: తప్పు కనిపించడ మేమిటండీ అర్థంలేనిమాట.

చె: నీదేతప్పు!

శ్రీ: మీ ఆవిడదే తప్పయ్యా!

క: మీ ఆవిడదే తప్పయ్యా.

మూ: రామ! రామ! యీ దెబ్బలాటలేమిటి! తప్పు తప్పు అల్లా కొట్లాడుకోరాదర్రా!

చె: నీదేతప్పు.

శ్రీ: నీదేతప్పు (ఇద్దరూ కొట్లాడుకుంటున్న ధ్వనులు)

క: మీ ఆవిడదే తప్పంటే తెలియూదయ్యానీకు.

ప్రి: చాల్లేవయ్యా! మీ ఆవిడని వెనుకేసుకువస్తున్నావు! యింతటి మగాడివి?

క: ఏమయ్యోయ్! శాస్త్రిగారూ! మాటలుమాత్రం జాగ్రత్తగారానీ!

ప్రి: సంతోషించాంలేవయ్యా!

సె : సిదేతప్పు !

తి : సిదేతప్పు !

('సిదేతప్పు' అనేధ్వనులు, 'కొల్లాయిధ్వనులు' క్రమంగా తగ్గిపోతుంటాయి.)

మూ : అయినా యీ తప్పుల తడకలమధ్య నేనెందుకు ?

(కీర్తిబాబు ప్రవేశం)

కీ : నే చెప్పానా ! వాళ్ళ గొడవల జోలికి వెళ్ళవద్దని ! నీ మూలానే వాళ్ళంతా అలా దెబ్బలాడు కుంటూంటా !

మూ : నేనేం చేశానోయ్ ! యిది మరీబాగుంది !

(భిక్షకుని ప్రవేశం తంబురాతో)

భి : కాలమహిమను తెలుసుకోరన్నా
తెలిసి బ్రతుకుకు విలువకట్టన్నా.

మూ : ఓ అబ్బీ ! యిల్లారా ! పొద్దున్నే కొంచెం దానం చేసుకుంటే పుణ్యం పురుషార్థం కూడాను.

బిచ్చగాడు :

ఘటికలన్నిటి కలిపిచూడన్నా
కలిపిచూచిన కాలమగునన్నా

బ్రతుకు విలువలు కలిపిచూడన్నా
కలిపిచూచిన ఘనతయగునన్నా కా॥

పొరగింటిగొడవల మనసలోయన్నా
పనికిమాలిన కయ్యమేలన్నా
పొట్లాటగూడిన బ్రతుకులోయన్నా
స్పర్ధచిటికల బ్రతుకులేయన్నా కా॥.

దేశాభ్యుదయమే మంచిఘనతన్నా
ఆ ఘనత బ్రతుకుకు మంచివిలువన్నా
కాలనది పరుగెత్తునోయన్నా
కదనివేగము విలువలేదన్నా. కా॥.



పాత్రలు :

వెంగళరావు : సహృదయ నగరంలో సేవాసమితికి అధ్యక్షుడు.
కార్యశర్మ : వెంగళరావుకు కార్యదర్శి.
నాగరికమణి : భార్య.
స్వేచ్ఛామణి : కూతురు.
జడమూర్తి : మేనల్లుడు.
ఆచారమ్మ : తల్లి.
చిఱుపైత్యం }
పెనుపైత్యం } నౌకర్లు.

## 1 వ రంగం

(వెంగళరావు అధ్యక్షతను సేవాసమితి వార్షికోత్సవము, జనం ఆసీనులై ఉంటారు. స్వేచ్ఛామణి, నాగరికమణి, జడమూర్తి కుర్చీలపై కూర్చుని ఉంటారు. నౌకరు చిఱుపైత్యం వెనకాల నిలబడి ఉంటాడు.)

వెంగళ : సభికులకు నమస్కారాలు. ఈ సేవాసమితి వార్షికోత్సవదినము యీనాడు జరుపుతున్నామంటే యిది సహృదయనగర చరిత్రలో సువర్ణాక్షరాలలో లిఖించదగిన విషయం. ఐదు సంవత్సరాలనుంచి నన్ను నిరాఘాటంగా యీ సమితికి అధ్యక్షునిగా ఎన్నుకుని నాయందు సంపూర్ణ విశ్వాసం చూపిస్తున్నందులకు మీకు నా ధన్యవాదాలు. (కరతాళధ్వనులు) మన సంఘం యింకా బాగుపడాలి అంటే మనని మనం యింకా సంస్కరించుకోవాలి. సంస్కరణ పెంపొందాలంటే యిటువంటి సేవాసమితులు వృద్ధికావాలి.... (చప్పట్లు.) మనలో సంకుచిత దృష్టి నశించాలి. స్త్రీపురుషులు, యజమాని, నౌకరు, బీదలు, ధనికులు అనే భేదంలేకుండా

అంటూ అన్ని విషయాలలో సమానహక్కులు కలిగివుండాలి. ఎటువంటి క్లిష్టసమస్యలు ఎదురైనా, మనిషి తన స్వతంత్ర బుద్ధి ఉపయోగించి వాటిని పరిష్కరించాలి. ప్రజాస్వామ్య పద్ధతిపై జీవితగమనం అత్యుత్కృష్టం. ఎటువంటి దుస్సాధ్య సమస్యఐనా. శాంతి అహింసలతో సాధించాలి. హృదయాలని పవిత్రంచేసే నిరసనవ్రతాల ఆయుధాలతో, సంకుచితదృష్టితో ప్రవర్తించే ఎటువంటి దుర్మార్గులనైనా సన్మార్గులచేసి. మన సంఘాల్లో సమానత్వం, స్వతంత్రం, నెలకొల్పాలి. అట్లు చేయగలిగిననాడే మన సేవా సమితులు తమ ధర్మం నిర్వర్తించినవవుతాయి. (కరతాళధ్వనులు) ఆఁ....యింకా యిలా మాట్లాడమంటె ఎంతసేపైనా మాట్లాడగలను. కాని మనకు కాలం చాల తక్కువ. అందుచేత కార్యదర్శిగారి ఆఖరి మాటలతో యీనాటికీ యీసభ ముగిద్దాము.

కార్యదర్శి : అధ్యక్షులవారు చెప్పింది అంతా సత్యమే అన్నట్లు కనిపిస్తూంది. వారు యీ సమితికి చేసినసేవ అపారం. నిజంచెప్పాలంటే మన సేవాసమితి యీ సహృదయ నగరంలో యిప్పటికి ఎందరి హృదయాలనో బాగుచేసింది. అంతే వారి సంకుచితదృష్టి పోగొట్టి చాలా విశాలదృష్టితో ప్రతివిషయమూ చూసేట్టు చేసింది. ఈసమితి స్థాపించిన తర్వాత యీ నగరంలో చాలా విషయాల్లో అన్నివిధాల అభివృద్ధి కనిపిస్తోంది. ఇది చాలా గర్వించదగిన విషయం. (కరతాళధ్వనులు) ఇంతకుమించి పెద్ద చెప్పవలసిన విషయాలు ఏమీ కనిపించవు. మనసమితి యీవిధంగా దినదినాభివృద్ధి పొంది, నిత్యనూతనశక్తితో పురోగమిస్తుందని ఆశిస్తా. ఇంతటితో విరమిస్తున్నాను. (కరతాళధ్వనులు.)

(జనుల కోలాహలం...కారునడుస్తున్నశబ్దం)

నాగరికమణి: ఈవేళ మీ ఉపన్యాసం చాలా పసందుగా ఉందండి.

స్వేచ్ఛామణి: నాన్న మాట్లాడుతుంటే, అల్లా నిలువునా గుడ్లప్పచెప్పి బొమ్మల్లా నిలుచుండిపోయారందరు.

జడమూర్తి: మామయ్య ఉపన్యాసాల సంగతి మీకేంతెల్సు. కొన్నిచోట్ల మామయ్య గొంతెత్తి గట్టిగా మాట్లాడుతూంటే, హృదయాలు కరిగి ఏడ్చినవాళ్ళుకూడా ఉన్నారు.

మంగళరావు: ఉపన్యాసాల ధోరణి ఎప్పుడూ అలాగే ఉండాలి. ఎంత ఉద్రేకంతో మాట్లాడితే అంతమంచిది.

(కారుఆగిన శబ్దం...తలుపు చప్పుడు)

స్వే: మామ్మా! మామ్మా!

ఆచారమ్మ: (తలుపుతీసిన చప్పుడు) ముట్టుకోకు. దూరంగావుండు. మడి కట్టుకున్నా. నువ్వు సభలకివెడితే వెళ్ళేవుకాని నాయనా! పెళ్ళందర్నీ కూడా ఎందుకురా తీసుకువెళ్ళడం. మనవంశంలో ఎప్పుడైనా ఆడవాళ్ళ బయటికివెళ్ళినపాపాన పోయారా!

మం: ఆ. చాల్లెద్దూ. చెప్పొచ్చావు. నీకున్న తెల్వితేటలు మాకులేక...

ఆ: ఏమన్నా అంటే కూకలేయడంతెల్సు. అందులో పెళ్ళియాడుకు వచ్చిన ఆ పిల్లని అల్లాత్రిప్పడం బాగులేదు.

జ: పరవాలేదు. అమ్మమ్మా! నేనుకూడా వెనకాలే ఉన్నానుగా.

నాగ: ఇంటికిరావడం తడవు, సాధింపులు బయల్దేరుతాయి.

అ : ఇందులో సాధింపు ఏమున్నదమ్మా : నాకుతోచినది నేనుచెప్పాను.

వే : సరేలెండి ! ఇంక యీ గొడవకు అంతంలేదా !

## 2 వ రంగం

వెం : ఒరే : చిట్టిపైత్యం !

చి : అయ్యా !

వెం : కొంచెం కాళ్ళుపిసకరా. సభల్లో వాగివాగి యింటికివస్తే, ఎందుకో కాళ్ళు నెప్పెడతాయి.

చి : అంతే బాబయ్యా ! గట్టిగా మాట్లాడుతూంటే, కాళ్ళలోశక్తి పైకి ప్రవహించి నోట్లోకి వచ్చేయడంవల్ల నీరసంవచ్చి కాళ్ళు నొప్పెట్టచ్చు.

వెం : నీకు యీమధ్య మంచి తెల్వితేటలు వస్తున్నాయిరోయి !

చి : చిత్తం. తమ ఉపన్యాసాలు వింటూండటంవల్ల. అయ్యగారూ, ఒక్క సందేహముంది బాబయ్యా !

వెం : అడగరా ! నాదగ్గర భయం ఎందుకు.

చి : తమరు మొన్న ఉపన్యాసాలలో 'యజమాని నౌకరు భేదంలేకుండా అందరికీ సమాన హక్కులు ఉండాలన్నారుకదా' అంటే ఏమిటి బాబు.

వెం : అంటే నువ్వు నాకు నౌకరువుకదా ! నేను వెళ్ళేకారులో నిన్ను కూర్చో పెట్టుకుని వెళ్ళటంలేదూ ! అంటే నువ్వూ నేనూ ఒకే కారులో కూర్చుని సమానహక్కులు పొందుతున్నామన్నమాట. పైగా ఒక్కొక్కసారి నేను కారుడ్రైవరుప్రక్కని కూర్చుం-

టూంటాను. అంటే నాతో వాడికి సమానహక్కు యిస్తున్నానన్న మాట. నువ్వు తక్కువవాడివి. నేను ఎక్కువవాడిని అనేభేదం లేకుండా అందరూ ఒకటిగా ఉంటాం.

చి: చిత్తం గొప్ప పెలువులు. తమ బుద్ధి చాల విశాలం.

వెం: సరేకాని, పెనుపైత్యం ఏడిరా!

చి: ఆ ప్రక్కగదిలో పై అందరికీ యింటాక ప్రక్కలు వేస్తున్నాడు బాబయ్యా!

(నాగరికమణి ప్రవేశం)

నాగ: ఏమండీ! ఈ నౌకరుకు యిదేంబుద్ధి! ఆ పెనుపైత్యం మీ పరుపు చక్కగా వేసి దానిమీద పడుకున్నాడు. వాళ్ళ పొగరుమోతుతనం తగ్గిస్తేగాని లాభంలేదు.

వెం: ఒరే చిటుపైత్యం! వాడిని ఇలా తీసుకురా లేపి. బుద్ధీ జ్ఞానం ఉండక్కర్లేదూ యీ నౌకరు పీనుగులకి.

నాగ: ఈమధ్య మరీ రేగిపోతున్నారండి. అసలు యింట్లోమాటే వింటల్లేదు.

(పెనుపైత్యం రాక)

వెం: ఏరా పెనుపైత్యం! ఇదేంబుద్ధిరా నీకు! నా ప్రక్కమీద పడుకుంటావుట్రా! ఒళ్లు హూనంచేసేస్తా చూడు.

పె: ఇంతకోపమెందుకయ్యా దొరా! పొద్దుటినుంచి పని చేసిచేసి ఒళ్లు నెప్పెట్టితే కాస్త ఒరిగాను. ఇందులో తప్పేముంది బాబయ్యా. ఇంతకీ చిటుపైత్యం చెప్పేడు కాబట్టి చేశాకావి, నాకు చేయాలని సరదా?

వెం: (చిఱుపైత్యంతో) ఏరా! నువ్వు చెప్పావా?

చి: నేనేంచెప్పాను?

పె: 'అయ్యగారి సృష్టిలో నౌకర్లు యజమాన్లు సమానమే. అందరికీ సమానహక్కులు యిస్తారు అయ్యగోరు' అని చెప్పలేమా... అందుచేత ఏమనుకోరని కాస్త మీ పరుపుమీద పడుకున్నా.

చి: అయ్యగోరు ఉపన్యాసాల్లో చెప్పిందే నేనూ వాడికి చెప్పాను.

వెం: చేసిన తెలివితక్కువ పనికి సమాధానాలిస్తున్నారు. పొండి! అవతలికి!...... యీసారి యిటువంటి పనులుచేస్తే డొక్క చీల్చేస్తా! (చిఱుపైత్యం పెనుపైత్యం నిష్క్రమణ.)

చి.పె: చిత్తం చిత్తం.

వెం: పాపం! నీకు చాలా కోపంవచ్చి వుంటుందే! నౌకరుమీద!

వాగ: కోపం రామటంటి మరి! ఎన్ని సమానహక్కులు యిచ్చినా మీరు పడుకునే ప్రక్కమీద పడుకోవడమేమిటి?

## 3 వ రంగం

వాగ: ఏమంటావోయి! నేను యీ కొంపలో యింక వుండలేను.

వెం: ఏం కొంపమునిగిందో!

వా: కొంప మునిగినట్టే! అర్థమైన ఆచారాలు చేస్తూంటే ఇంట్లో వుండాలా! ప్రొద్దున్నుంచి సాయంత్రందాకా మడిట! మడి! ప్రతీవస్తువూ నిప్పుల్లోపెట్టి కడుగుతోంది ఆవిడ. మన స్వేచ్ఛామణి ఫలహారం తింటూంటే, చిన్నముక్క యెగిరి, నా స్నోడబ్బామీద

పడింది. సోడాబుడ్డి అంటుపడిందని దానినిండా పేడనీళ్ళు చల్లింది మీ అమ్మగారు. ఏమిటండీ యీ అర్థంలేని ఆచారాలు! 'అపర ఆచారమ్మ' అని తగిన పేరే సంపాదించుకుంది మీ అమ్మగారు.

వెం: పోనీలెద్దు! దానితో మనకేమిటి? ఏదో సర్దుకోవాలిగాని.

నా: ఎంతకాలమండీ సర్దుకోవడం....పోనీ ఆవిడని కొన్నాళ్లు మీ తమ్ముడివద్దరకు పంపించకూడదూ.

వెం: చూద్దాంలే.

నా: మన స్వేచ్ఛామణి, జడమూర్తి, సౌకర్ణ అందరూ యిదే అంటు న్నారు ఆవిడ ఆచారంతో వేగలేక. ఆవిడకీ మనకీ కొంతగోల తప్పుతుంది.

వెం: ఆలోచిద్దాంలే!

నా: ఇంకా ఆలోచన ఎందుకండీ! ఇంతమంది జనం ఏకగ్రీవంగా ఒక విషయం చెపుతూంటే, అది పాటించడానిక్కి వెనుకాడతా రెందుకు? మీరే అనేకసార్లు అన్నారు 'అధిక జనాభిప్రాయం అన్ని విషయాల్లో పాటించాలని'.

వెం: సరే అన్నింటికి యీ అధిక జనాభిప్రాయం ముడిపెడితే ఎట్లా! తమ్ముడింటికి వెడితే పాపం ఆవిడకి సుఖ మెక్కడుంటుంది! వాడిభార్య మరీ పరమగయ్యాళి! నువ్వు కాస్త మంచిదానవు కాబట్టి!

నా: నా మంచితనం మండినట్లుగానేవుంది...మీరు ఆవిడని పంపించక పోతే! మీకు యిష్టంలేకపోయినా, స్వతంత్రంగా నేను మా పుట్టింటికి పోతాను.

వెం: వాళ్లే అంతపనిమాత్రం చెయ్యరు. నువ్వు లేకుండా సభలకువెళ్ళితే గౌరవం వుండొచ్చా!....సరేలే! అధిక జనాభిప్రాయం పాటించవలసిందేగా! లేవ పంపేద్దాంలే అమ్మని.

## 4 వ రంగం

వెం: ఏమమ్మా! స్వేచ్ఛామణీ! మన జడమూర్తి నిన్ను పెళ్ళిచేసుకుంటా నంటున్నాడు. నీ ఉద్దేశమేమిటి?

స్వే: నాకిప్పు డప్పుడే పెళ్ళివద్దు నాన్నా.

వెం: అదేమిటమ్మా అల్లాఅంటావు. పద్దెనిమిదేళ్లు వచ్చాయికదా! ఎవరో ఒకరిని పెళ్ళిచేసుకోకపోతే ఎట్లా! జడమూర్తి మనకి కావలిసిన వాడు. కొంచెం చదువు తక్కువైతేనేం బాగా ఆస్తివున్నవాడు, నాగరికుడు, పైగా చాలా మంచివాడు.

స్వే: ఇప్పుడే పెళ్ళిచేసుకుని భర్త అధికారపు దాసిత్వంలో పడివుండ లేను. నాకు యింకా కొంతకాలం స్వేచ్ఛకావాలి.

వెం: తప్పు తప్పు మనకి ఎన్ని అభ్యుదయపు ఊహాలున్నా పెళ్ళిచేసు కోవాలి. అది సంఘ నియమం. అందులో ఆడదానికి మరీని.

స్వే: దీనికి కంగారేముందినాన్నా. ఆలోచిద్దాం.

వెం: మంచిది. అయినా ఆలోచించు.

## 5 వ రంగం

[illegible]: ఏమండోయి! మీ జడమూర్తి ఫోంచేయడం మానేశాడు నాల్గు రోజుల్నించి.

వెం: అదేం! వాణ్ణి యిలా పిలు.

(జడమూర్తి రాక)

వెం: ఏమోయి జడమూర్తి! భోజనం మానేశావుట.

జ: అవును మానేశాను.

వెం: కారణం.

జ: నిరశనవ్రతం పట్టాను. ఈ నిరశనవ్రతంలో అనుకున్న కార్యం సాధించాలి. లేకపోతే చచ్చిపోవాలి అంతే.

వెం: ఇంతకీ ఆకార్యమేమిటి?

నా: ఇంకేముంటుంది లెండి! మన అమ్మాయి ఇతన్ని పెళ్లిచేసుకో నన్నట్లుంది. అందుచేత యీకోపాలు తాపాలు.

వెం: ఓస్! ఈమాత్రందానికి భోజనం మానేశాలటోయ్! నేను చెప్తాలే దానితో. వెళ్లి భోంచెయ్యి.

జ: మీరేగా చెప్పారు! ఏటువంటి క్లిష్టసమస్య అయినా నిరశన వ్రతాలతో పరుల హృదయాలు పవిత్రపరిచి, పరిష్కరించవచ్చని. ఈ వ్రతం పాటించవలసిందే! కార్యసాఫల్యం పొందేదాకా!

వెం: ఇదేమిటోయ్! మంకిపట్టు పట్టుకూర్చున్నావు.

జ: ఇది మంకిపట్టుగాదు. మేనమామకూతుర్ని నేను భార్యగా చేసుకునే హక్కు నాకువుంది. అది నా జన్మహక్కు. నా హక్కుకోసం నే పోట్లాడుతున్నా.

వెం: నీ హక్కులు నే బలపరుస్తా. వెళ్ళి భోంచెయ్యి.

నా: బాగానేవుంది భాగోతం! మామగారి బోధనలు బాగానే చెవి కెక్కాయి.

జ: స్వేచ్ఛామణి పెళ్లి చేసుకుంటానంటేగాని నేను ఫోంచెయ్యను.

వెం: ఒరే! అమ్మాయిని ఇలా పిలు. సంగతి కనుకుంటా.

నా: ఒరే! చిటుపైత్యం అమ్మాయి ఇంట్లో వుందేమో ఇలా పమ్మను.

(పెనుపైత్యం రాక)

పె: అమ్మాయిగారు ఇంట్లో లేరండి.

వెం: ఎక్కడికి వెళ్ళివుంటుంది.

నా: స్నేహితుల యింటికి వెళ్ళిందేమో!

వెం: ఆ చిటుపైత్యాన్నిపంపి, అమ్మాయి ప్రక్కింటివాళ్ళయింట్లో వుందేమో తీసుకురమ్మను.

పె: చిటుపైత్యం యింట్లో లేడండీ! ఏ పనిమీదైనా బయటికి వెళ్లాడేమో!

వెం: జడమూర్తీ నామాటవిను. నువ్వువెళ్ళి ఫోంచెయ్యి. అమ్మాయి వచ్చాక దానిచేత ఒప్పిస్తాను నిన్ను పెళ్ళిచేసుకుందుకు.

జ: ఇటువంటి షరతులు నే నంగీకరించను. స్వేచ్ఛామణిని, రానీయండి వచ్చాక ఒప్పుకున్నాక ఫోంచేస్తాను.

నా: పెళ్ళివిషయాల్లో యిలా పట్టుపట్టగూడదు. ఎవరి యిష్టానికి వారిని వదలివేయాలి.

జ: ఇది నా పెళ్ళివిషయంకాబట్టి యీ నిరశనవ్రతం నా యిష్టం.

వెం: సరేలే! అమ్మాయి రానీచూద్దాం.

# 6 వ రంగం

(పాంరోజుల తర్వాత)

నా : ఏమండీ ! అమ్మాయి యెక్కడా కనిపించలేదా !

వెం : అదే ఆలోచిస్తున్నాను.

నా : ఈ మొండి జడమూర్తి ఇంట్లో నిరశనవ్రతం పట్టుకూర్చుంచే పాపం ! అది ఇంటికెందుకు వస్తుంది. దానికి ఇష్టంలేకపోతే మనం పెళ్ళిచెయ్యకూడదండీ.

వెం : దాని కిష్టంలేనిపెళ్ళి మనమెందుకుచేస్తాం.... పోనీ ఇంటికివచ్చి పాపం ! ఆ జడమూర్తిని కొంచెం సముదాయించరాదూ ! ఇప్పటికి పన్నెండురోజులైంది వాడు నిరశనవ్రతం పూని. చిక్కి ఒక్కగా శల్యమైపోయాడు.

నా : ఈ దరిద్రగొట్టు నిరశనవ్రతమే ఇంతవరకూ దెచ్చింది. ఇదంతా మీ ఉపన్యాసాలఫలితమే.

వెం : నేనేం చేశానే ! ఏదో ఉపన్యాసాల్లో చెప్పినవంతా పాటిస్తాకని యెలా అనుకుంటాను. పైగా ఆ రాజకీయ విషయాలు ఇలా ఇంటి విషయాలతో ముడిపెడితే ఎట్లా ?

నా : పోనీ ! ఆ ఉపన్యాసాలలో వివరంగా చెప్పలేకపోయారా ! ఇలా ముడిపెట్టకూడదనీ !

వెం : ఏదో ఉద్రేకంతో మాట్లాడేటప్పుడు ఇలా వివరాలన్నీ ఎలా చెప్పగలం.

నా : అందుకే అనుభవించాలి యీ ముప్పంతా.

(కార్యదర్శి ప్రవేశం)

కా : నమస్కారం వెంగళరావుగారూ.

వెం : ఏమోయి కార్యదర్శి ఇలా వచ్చావు.

కా : మీ అమ్మాయిగారు కనిపించటంలేదనీ, మీరు ఆమెకోసం వెతుక్కుంటున్నారనీ విని, ఇలా వచ్చాను.

వెం : అవునోయి ! అదే ఆలోచిస్తున్నాం మేము.

కా : నిన్న నేను అదృశ్యనగరంనుంచి వస్తూంటే, మీ అమ్మాయి, చిలుపైత్యం కనిపించారు. చిలుపైత్యాన్ని మొదట ఆనమాలు పట్టలేకపోయాను సుమండీ ! ఆ సిల్కు బట్టల్లో ఎవరో గొప్ప వాడిలా కనిపించాడు. మాట్లాడడమెందుకని నేను మాట్లాడలేదు.

వెం : (ఆశ్చర్యంగా, విచారంగా) అలాగా !

కా : ఏదో ఈ సంగతి చెప్పిపోదామని వచ్చాను. మరి సెలవండి. మళ్ళీ మన సేవాసమితిలో కలుసుకుందాం. (నిష్క్రమణ)

నా : వాడి మొగంమండ. ఇందుకా ఇంతకాలంనుంచి చిలుపైత్యంకూడ కనిపించటంలేదు.

వెం : ఒరే పెన్నుపైత్యం ఆ దౌర్భాగ్యుడు చిలుపైత్యం ఇన్నాళ్ళ నౌకరీలోకి ఎందుకు రాలేదురా ?

పె : ఏమో దొరా నాకేంతెల్సు ?

వెం : మన అమ్మాయితో ఎప్పుడైనా ఒంటరిగా రహస్యంగా మాట్లాడే వాడా వాడు !

పె : మాలాగే మాట్లాడుతూండేవాడు దొరా. అప్పుడప్పుడు చిలుపైత్యం

అంటూండేవాడు. "అయ్యగోరూ మనంఅంతా సమానం కదట్రా ఈ కాలంలో. అందుచేత అమ్మాయిగార్ని పెళ్ళిచేసుకుంటే తప్పేంట్రా" అనేవాడు. నేనుమాత్రం కూకవేసేవాణ్ణి దొరా.

వెం: ఎందుకూ పనికిమాలిన భ్రష్టపీనుగులు దొరికారు. బుద్ధి. జ్ఞానం ఉండనక్కర్లేదూ ఈ నౌకరుపీనుగలకు. ఫో: నువ్వుకూడా అవతలికి ఫో: రేపటినుంచి నౌకరీలోకి రానక్కర్లేదు.

పె: చిత్తం చిత్తం (నిష్క్రమణ)

(జడమూర్తి ప్రవేశం)

జ: ఏమిటి మామయ్యా అంటున్నావ్,

వెం: ఆఁ (విచారంగా) ఏమీలేదురా:

జ: సంగతిఅంతా విన్నాలే: నేను 'అదృశ్యనగరం' పోయి, స్వేచ్ఛామణిని వెదికి, దానిముందు నిరశనవ్రతం ప్రారంభిస్తా. కార్యసిద్ధి పొందుతానని ఆశీర్వదించుమామయ్యా.

వెం: వెళ్లిరా నాయనా (విచారంగా) విశాలబుద్ధి అంటే అల్లాగుండాలి. మన అమ్మాయి తప్పుచేసినా మన జడమూర్తి అమ్మాయికంటె వెయ్యిరెట్లు మంచివాడు.

నా: వాడే మంచివాడు మీకు. ఈ మూర్ఖుడి నిరశనవ్రతం పాపం దాన్ని పరదేశాల పాలుచేసింది.

వెం: చాల్లే చేసిన తప్పు కప్పుతున్నావా:

నా: ఇదంతా మీ మూలానే: మీ ఉపన్యాసాలే ఇంతవరకు తెచ్చాయి.

నేను ఈ కాపురం చెయ్యలేను. మా పుట్టింటికిపోతా. కొన్నాళ్లు (విచారంగా) అక్కడఉంటే కొంత మనశ్శాంతి. (నిష్క్రమణ)

వెం: పోతే పో! కొన్నాళ్లు నాకూ మనశ్శాంతిగా వుంటుంది....ఆఁ. అందరూ నిష్క్రమించారా? ఈ గృహంలో ఇంక ప్రజాస్వామ్యం ఎందుకు! నేను ఒక్కణ్ణిగా! ఇకముందు అంతా నిరంకుశత్వమే. కనిపించనివాటితోనూ, జీవంలేనివాటితోనూ ఇంక నా నిరంకుశత్వం... ఇది నా ఖర్మ.... (వెక్కి వెక్కి ఏడుస్తాడు).



పాత్రలు :

అనామకుడు : } భార్యాభర్తలు
విద్యావతి : }

సంస్కారశ్రీ — విద్యావతికి అన్న

ఉద్దండశ్రీ — సంస్కారశ్రీకి గురువు

పురోగామిశ్రీ :

---

## 1 వ రంగం

(అనామకుడుగారి ఇల్లు)

ఒక కంఠం:- టెలిగ్రాం! (తలుపు తట్టుతూ)

విద్యావతి: ఆఁ ఆఁ వస్తున్నా. (తలుపు తెరిచిన చప్పుడు. కాగితం మడత విప్పిన చప్పుడు. వెక్కి వెక్కి ఏడుస్తూ) అయ్యో! ఏమండోయి! హా హా... ఏమండోయి!

అ: ఆఁ. ఎమిటి? ఏమయింది? ఎక్కడనుంచి టెలిగ్రాం?
(కాగితం చప్పుడు)

వి: చూశారా!

అ: ఆఁ. (నిట్టూర్పుతో) ఆశ్చర్యం! జబ్బుగా వున్నట్టే తెలియదే?

వి: దాని మూరేళ్ళ బ్రతుకు బ్రద్దలయింది. పెళ్ళికి తొందరేముందని నే మొత్తుకోలేదూ! నా మాట ఒకలెక్క. ఇప్పుడేంచేసేది.

అ: (నిట్టూర్పులు) బాగుంది. యింత కష్టం వస్తుందనుకోలేదు.

వి: కాని చదువయిన తర్వాత పెళ్ళిచేస్తే వచ్చిన నష్టమేముంది. తగుదునమ్మా అని మన సంసారాలు సరిదిద్దటానికి అందరూ తయారే! యిప్పుడేం చేస్తారు ఆ పెద్దమనుష్యులు!

అ: బ్రహ్మ వ్రాసిన వ్రాత ఎవరు తప్పించగలరు?

వి: చేతులారా కష్టాలు తెచ్చిపెట్టుకుని వేదాంతం వెనకాల దాగుకొనడం తెలుసును. అప్పుడే పెళ్ళిచెయ్యకపోతే యీ విధవరికం అమ్మాయికి వచ్చేదా?

అ: భవిష్యత్తు గురించి తెలుసుకోగలిగితే మానవ జీవితం సాఫీగానే వెళ్లేది.

వి: సక్రమవిధానంలో జీవించడం తెలుసుకున్నవాడికి భవిష్యత్తు గురించి బెంగ, ఆలోచన వుండవు. (విచారంగా) యీ సమయంలో మన తర్కవితర్కాలెందుకుగాని...అమ్మాయి ముందుబొట్టుకు చూస్తే గుండె తరుక్కుపోతూంది.

అ: అంతా దైవ నిర్ణయం.

(సంస్కారిశ్రీ ప్రవేశం)

సం: (ఒగరుస్తూ, హడావిడిగా) చెల్లాయి ..చెల్లాయి. బావ ఏడీ.....త ఏమయ్యోయి! అనామక వావా! ఏమిటీ దీర్ఘాలోచన చేస్తున్నావు.

అ: దీర్ఘాలోచనకాదురా! యిప్పుడే యీ టెలిగ్రాం వచ్చింది. చూడు!

సం: (కాగితం విప్పినదప్పుడు) (నిట్టూర్పులతో) బాగుంది! రెండు రోజులు సరదాగా గడిపిపోదామని నేవచ్చాను. రావడం యీ మరువార్త వినడానికిలా కనిపిస్తోంది.

వి: వద్దు మొర్రో అన్నా ఆయన అన్నగారి మాటలు పురస్కరించుకుని పెళ్ళిచేశారు మన అందరికి ఎదురు తిరిగి. యిప్పుడు ఏమనుకుంటే ఏం లాభం!

సం: (ఆవేశంతో) యిప్పటికైనా వింటావా బావా నా మాట. బాల్య వివాహాలవల్ల నష్టాలయినవి. రజస్వలానంతరవివాహాలు చేస్తే అప్పటికి స్త్రీల హృదయాలు పరిపక్వమౌతాయి. పైగా యిటువంటి బాలవైధవ్యము సంభవించదు.

అ: (విచారంగా) అవునురా. నీ మాటలు విననందుకు యిప్పుడు అనుభవించవలసి వస్తోంది. అయినా మేనల్లుడుమాత్రం ఏం పెద్దవాడు. 16 సంవత్సరాలేగా! ఏదో విషజ్వరం వచ్చి హఠాత్తుగా చని పోయాడుగాని!

సం: చావడానిక్కారణమేదైనా, వైధవ్యం నీ కూతుర్ని ఆవేశించింది. గదా!

వి: ఈ నాటికి మన వంశంలోకూడా బాలవైధవ్యం సంప్రాప్తించింది.

సం: చెల్లాయి.... వచ్చిన కష్టాలకి విచారిస్తూ కూర్చుంటే లాభంలేదు. వాటికి ప్రతినిత్యం నివారణమార్గం ఆలోచిస్తూ ప్రయోగమించాలి. జీవితంలో....బావా! ఇప్పటికైనా ఆలోచించు. నిర్మల ఎలాగా చదువుకుంటూందిగా; చదువు పూర్తయిన తర్వాత ఆమెకు తిరిగి వివాహం చేద్దాం. దేశంలో కోట్లాదిగా యిలా బాల్య వివాహాలవల్ల గాని, మరేవిధంగాగాని, విధవల జనాభా దినదినం మితిమీరి పోతుంటే, మాలాంటి సంస్కర్తలు గుర్తుపెట్టించి చూస్తారేరు. నిర్మలకు తిరిగి వివాహం కావలసిందే!

అ: అదేమిటిరా! తిరిగి పెళ్ళిచేద్దామా అమ్మాయికి! పోనీ చదువు చెప్పించి ఏ మాష్టరీలోనో చేర్పిస్తే, దాని జీవితం అది గడుపు కుంటూందిగా!

సం: బావా! నీకు వ్యక్తి హృదయం బాగా అవగాహన కాలేదు. యీ ఆధునిక ప్రపంచంలో ప్రతినిత్యం తనచుట్టూ స్త్రీ పురుషులు భౌతిక జీవిత మకరందము పూర్తిగా ఆస్వాదిస్తూ సుఖంగా కాలం గడుపుతూంటే, ఆ దృశ్యాలమధ్య ఒక అమాయికజీవి హృదయం రేకెత్తి బాధించే, భావపరంపర, జీవితసుఖాల రుచిలో మరిగిన మైకం కమ్మిన మీకెల్లా తెలుస్తుంది. ఆ బాధించే భావపరంపర వ్యక్తి జీవితం చిట్టచివరకు పాడుచేయవచ్చు. విలువైన జీవితాలు కాల ప్రవాహ వేగంలో నాశనం కాకుండా అడ్డుపెట్టి, సత్యమైనదారిలో చేర్చేది, యీ విధవా వివాహ... నిర్మల జీవితం మాడినమోడులా వైధవ్యంతో నశింపచేయడం నా కిష్టంలేదు. నిర్మలకు తిరిగి వివాహం చేయవలసిందే!

వి: సంస్కారశ్రీ అన్నయ్య మాటల్లో చాల సత్యముంది.........దాని బ్రతుకు.... (ఏడుస్తుంది)

ఆ: అయినా తొందరేముంది. అమ్మాయికి యిప్పుడు 10 ఏండ్లేగా యింకో పదేండ్లు గడిచాక ఆలోచించుకోవచ్చు. ప్రస్తుతం మటుకు (నిట్టూరుస్తాడు)

సం: ఏమైనా సరేబావా! నిర్మలకు తిరిగి వివాహం కావలసిందే. నా సంస్కారణ యింటిలోకూడా ఒక నిజరూపం పొందవలసిందే!

## 2వ రంగం

(ఒక దశాబ్దం తర్వాత)

అనా: (దగ్గుతూ, బాధపడుతూ) యిదిగో కొంచెం మంచినీళ్ళియ్యి.

వి: యివిగో. తాగండి.

అ: ఉత్తరం అందిందా!

సం: ఆc. అందుకే వచ్చాను.

అ: ఇంక బ్రతకలేనురా! ఆఖరి ఘడియలు వచ్చాయి.

సం: అలా అధైర్యపడకు నాన్నా! జబ్బు అదే నయమవుతుంది. (నవ్వుతూ) ....నే వచ్చాగా! నాన్నకు మందు తీసుకురా! చెల్లాయి! ఇలా సొంత నా చేత్తో ఇస్తామందు! రోగం ఇట్టే నయమవుతుంది...నిర్మల ఏదీ!

వి: అలా ఇప్పుడే బయటికి వెళ్ళింది.

అ: హాc. అమ్మా! నాకు ఎక్కువగా వుంది. హాc. అయ్యో! (మూల్గుతాడు)

సం: ఇదేమిటి నాన్నా! డాక్టర్ని తీసుకురానా!

అ: ఇంకెందుకు...అబ్బ. హాc. అమ్మో! ఆc ఆc....ఆc....

సం: చెల్లాయి! చెల్లాయి! ఇల్లారా! నాన్న నోరు తడబడుతోంది.

వి: (కంగారుగా, విచారంగా) ఆc ఆc.... ఏమిటి!

అ: ఆc...ఆc....నిర్మల....ని....ర్మ....ల. (పెద్దదగ్గు)(చనిపోతాడు)

వి: అమ్మో! అయ్యో!

(విద్యావతి గొల్లున ఏడుపు....జనుల కోలాహలం)

సం: [ విషాదచ్ఛాయలతో విచారంగా ] నాన్న చనిపోయాడు....చెల్లాయి కూడా విధవ అయింది.... వచ్చిన కష్టాలకి విచారిస్తూ కూర్చుంటే లాభం లేదు. వాటికి ప్రతినిత్యం నివారణమార్గం ఆలోచిస్తూ ప్రయోగించాలి జీవితంలో.

(6 నెలల తర్వాత)

సం: ఉద్దండశ్రీగారూ! మీ అడుగుజాడలో, జీవితంలో ఒక నూతన వెల్గు చూడగలిగాను. నా శక్తిసామర్థ్యాల నుపయోగించి, దేశంలో ఎందరివిధవలకో పునర్వివాహాలు చేశాను. యీ విషయం మీకు తెలిసిందే! యింటగెలిచి రచ్చగెల్వమన్నారు. ఇప్పుడు ఇంట్లో యిద్దరు విధవలున్నారు. నా చెల్లాయి విద్యావతి. ఆమె కూతురు నిర్మల. యింట్లో యీవైధవ్యాలు రూపుమాపకపోతే లోకం నన్ను హేళనచెయ్యదూ! ఆదర్శాలు బోధించడంలోనేగాక స్వవిషయంలో అమలులో పెట్టినప్పుడేకదా జీవితం ఉత్కృష్టత పొందుతుంది!

ఉ: సంస్కారిశ్రీ! నీ హృదయబాధ అర్థమయింది. మీ చెల్లెల్ని యిలా పిలు. నాకు తోచినవిధంగా ఆమెను సమాధానపరుస్తా.

సం: చెల్లాయి! చెల్లాయి!

[ విద్యావతి ప్రవేశం ]

ఉ: నమస్కారమండీ!

వి: నమస్కారం.

సం: యీయన ఉద్దండశ్రీగారు, నాకు ఒక విధంగా గురువు.

వి: మిమ్మల్ని గురించి పత్రికల్లో విన్నాను.

ఉ: నేను వచ్చిన సంగతి చెప్తున్నాను. మీ అన్నయ్య నీ విషయంలో చాలా బాధపడుతున్నాడమ్మా!

వి: అన్నయ్య భావాలు బాగా నాకు తెలుసు. నిర్మలకు వివాహంచేయడం నాకూ సమ్మతమే. యిప్పుడు నా వివాహం జరగడం అంత బాగుండదనుకుంటా. యిప్పుడు నా వయస్సు నలభయి ఏండ్లు.

ఉ: మీ మాటలు నాకు అర్థమౌతున్నాయి. కాని ఉత్కృష్ట ఆశయాలు అమలు జరుపవలసి వచ్చినప్పుడు చిన్న ఆశయాలు త్యజించకరించాలి, యిప్పుడు మీ అమ్మాయి వివాహం జరగడం ముఖ్యాశయం. కాని ఆమె వివాహం జరపాలంటే నిండు దంపతులు కావాలిగదా! మీ కుమార్తె వివాహ సమయంలో పీటలమీద వరాయి దంపతులు కూర్చోవలసివస్తే, చాలా బాధగా ఉంటదటమ్మా!

వి: అవును బాధే అనుకోండి.

ఉ: పైగా మీ వయస్సు నలభై అంటే చాలా స్వల్పవయస్సు. మనిషికి ఆయుర్దాయం వందసంవత్సరాలు. వివాహం చేసుకోకపోతే యింకా మీదు అరవయి సంవత్సరాలు వైధవ్యం గడపవలసి వస్తుంది కద టండీ!

వి: గడపవలసి వస్తుందనుకోండి!

ఉ: పైగా మీ కుమార్తెకు వివాహంచేశాక, అల్లుడ్ని పండుపూటలు యింటికి పిల్చి, సంతృప్తిగా భోజనం పెట్టడానిక్కీ, మరి ఎన్నో విషయాలకి ఒక మగదిక్కు కావాలిగదా!

వి: కావాలనుకోండి!

ఉ: యిన్ని ముఖ్యవిషయాలు మీరు తిరిగి పెళ్ళి చేసుకోవాలని ఋజువు చేస్తూంటే, మరి మీరు వివాహం చేసుకోకపోడం ధర్మంకాదు. ఆదర్శసంఘ సంస్కరణలు మీ అన్నగారు యీ దేశంలో అమ లులో పెట్టారు. మీవంటి చెల్లెండ్రు ఆయనకి తోడ్పడి, ఆయన జీవితం తరతరాలవరకు ఒక చిరస్మరణీయ గాధగా మార్చాలి.

వి: అవునండి....కాని....

ఉ: యింక "కాని" అనకండి. మీరు క్రొత్త గొప్పో చదువుకున్నవారు. ...నామాట వినండి... నా స్నేహితువొకడున్నాడు. పురోగామిశ్రీ ఆయన మొదటిభార్యపోయి రెండేళ్ళయింది. నలభై ఐదు సంవత్సరాలుంటాయి. మీకు తగిన వయసు. ఆయనకి సంఘసంస్కరణ అంటె అభిమానం ఆయన్ని మీరు వివాహంచేసుకోవాలని నా మనవి.

వి: ఆలోచించి చెబుతానండి.

ఉ: ఆలోచించడం లేదు. ఊం. అనండి. పాపం! మీ అన్నయ్యగారిని చూడండి. దిగాలుపడి కూర్చున్నారు. ఆయనకు సంతోషం కలిగించడం చెల్లెలి విద్యుక్తధర్మం. పైగా మీకు పిల్లా పీచు ఎక్కువలేరు. మీ వివాహం అయ్యేక, మీ అమ్మాయి వివాహం యిట్టే జరిగిపోతుంది. పాపం! అనామకుడుగారు బ్రతికివుంటే యీ అమ్మాయి వివాహం అయిపోయేది యీ పాటికి. నిర్మల వివాహం గురించి బెంగపెట్టుకొని చనిపోయాడు ఆయన......అంతా విధి...యింతకీ మీ అమ్మాయి వివాహం జరుపడానిక్కి నిండు దంపతులుంటే కళకళలాడుతుందనీ మిమల్ని వివాహం చేసుకోమంటున్నాంగాని మీ కోసం ప్రత్యేకం కాదుగా!

వి: సరేలెండి. మీరు చెప్పిన మాటల్లో సత్యం కనిపిస్తొంది కొబట్టి...

ఉ: అంతేలెండి!....సంస్కారశ్రీగారు! మరి తక్కువ విషయాలు నే మాట్లాడతాగా!... [నవ్వుతూ] యిప్పుడైనా ఉషారుగా ఉండవయ్యా! నీ మనోరథం సిద్ధించిందిగా!

## 4వ రంగం

(తరువాత కార్యక్రమము)

(వివాహం....తూతూ బాకాలు...ఆశీర్వచనాలు)

సం: ఈ విధంగా యిక్కడ వితంతు వివాహం జరిగిందంటే అది అంతా నా గురువుగారి ఆశీర్వచనం. నా గృహంలో నా ఆదర్శాలు అమలు జరిపి నాకు కీర్తి తెచ్చారు ఉద్దండశ్రీగారు. ఇప్పుడు ఆయన రెండు ముక్కలు మాట్లాడుతారు.

ఉ: కీర్తిప్రతిష్ఠల కాశించి ఏ పని చెయ్యరాదు. నమ్మిన ఆదర్శాన్ని ఆచరణలో పెడితే కీర్తి ప్రతిష్ఠలు వద్దన్నా వచ్చి మీద పడతాయి! అందుచేత యీ నాడు పురోగామిశ్రీ, విద్యావతీ దంపతులకు సుఖ జీవితం గడపమని ఆశీర్వదిస్తున్నాను,

ఒకకంఠం: పురోగామిశ్రీ చాలా అదృష్టవంతుడు. విద్యావతివంటి విధవ భార్య లభించినందుకు,

పురో: ఉద్దండశ్రీగారు! మరి మీ ఆవిడచేత ఒక పాట పాడించండి. యీ శుభసమయంలో.

ఉ: అది మీ బావగారిచేత చెప్పించాలి. ఇటువంటి దరఖాస్తులు సరియైన మార్గంలో వెళ్ళాలి.

సం: దానికేంలెండి! చెల్లాయి! ఒకపాట పాడు. మీ ఆయన వింటారుట.

వి: (సిగ్గుతో) పాటలు మర్చిపోయానండి. అలవాటులేక,

సం: మొదటిపెళ్ళి అయినప్పుడు సంగీతం బాగా నేర్చుకుందండి మా చెల్లాయి. తర్వాత సంసారంలోపడి మర్చిపోయింది. మళ్ళీ పెళ్ళవుతుందని దానికేం తెల్సు. లేకపోతే కొంచెం సాధనచేసివుండేది.

శి: అఁ. ఫర్వాలేదు. ఏదివస్తే అదిపాడు. ఒక కర్నాటక కకీర్తన పాడమ్మా!

వి: (గొంతుక సవరిస్తూ)

సస....రిరిగమ....పదనిస

సరిగమ....పదనిస

దనిసమ...గరిపమ

దనిపని సరి....దని పనిసరి

ఒకకంఠం: (మెల్లిగా) మరయితే వాళ్ళమ్మాయి నిర్మల పెండ్లి ఎప్పుడు చేస్తారురో!

రెండవకంఠం: ఉండరా! ఆ పాట వినదూ! గొడవ పెట్టక.

వి: సరిగమపదనిస....పదనిస సరిగమ

దనిపని సరి....దనిపని సరి....దనిపని సరి

("దానిపని సరి"అనే ధ్వనించేటట్లు)

(తప్పట్లు)



పాత్రలు :

1. రమణమూర్తి : } భార్యాభర్తలు
2. విశాలాక్షి :
3. వెంకటేశ్వర్లు : చనిపోయిన వెంకమ్మకు తమ్ముడి వరస
4. పాలయ్య : వెంకటేశ్వర్లుకు పొరుగింటి మనిషి
5. పుల్లమ్మ : } మూర్తిని పరామర్శచేయడానికి వచ్చిన బంధువు
6. సుబ్బమ్మ : లలో యిద్దరు. నలభైఐదు ఏండ్ల వితంతువులు

---

## 1వ రంగం

[వసారా— చనిపోయిన వెంకమ్మకు దహనక్రియలు జరుగుతాయి]

వెంక: ఏం నాయనా: దహన క్రియలన్నీ పూర్తయ్యాయా?

రమణ: ఇప్పుడే అయ్యాయండి.

వెంక: అప్పుడే అపరాహ్ణం దాటింది. కాస్త రెండు మెతుకులుకూడా నోట్లో వేసుకోలేకపోయారా పాపం!

రమణ: అదికూడ యిప్పుడే అయిందండి,

వెంక: (వెటకారంగా) అయిందిగదా! సరే.... చూస్తూచూస్తూ యిలా హఠాత్తుగా చనిపోతుందనుకోలేదు నాయనా!

రమణ: ఎవరికి ఎన్నాళ్ళు యీ భూమిమీద ఋణమో, అంతకాలమే బ్రతుకుతారు.

వెంక: మీరంతా యింతకాలం దూరంగా వుండిపోయారు, ఇక్కడ నేను

ఒంటిగాణ్ణై పోయను. నా శరీరంలో జవసత్వాలు వున్నంతవరకు ఆమెకు చాకిరీ చేశాను.

రమణ: మీకు అమ్మగారని ఆ అభిమానం వుండబట్టి, పండు ముసలిదైనా నాయనమ్మను కనిపెట్టిచూశారు.

వెంక: అయినా నేను చేసిందిమాత్రం ఏముందిలే!.... చివరివరకు ఎప్పుడూ నీ మాటేరా దాని నోటివెంట: 'మనమడు దూరంగా పోయాడు. చచ్చేటప్పుడికైనా వస్తాడో రాడో' అని విలపించేది:

రమణ: మనుమడనైనందుకు, ఆ మాత్రం అభిమానం ఉండవద్దండీ మరి!

వెంక: ఏదో యీ పన్నెండు రోజులు దివ్యంగా అంత్యక్రియలు జరిగాయంటే ఆ ముసలిది స్వర్గంలో సంతోషిస్తుంది. మీ నాన్న పోయినందుకు యీ బాధ్యత కుఱ్ఱాడివైనా నీ మీద పడింది పాపం.

రమణ: ఇది పెద్ద బాధ్యత కాదులెండి.... ఏ ముహూర్తాన మానాన్న నాకు ఒడుగు చేశారో, అప్పటినుంచి నా కుటుంబంలో చనిపోయినవాళ్ళ దినవారాలు చాలవరకు నేనే పెట్టవలసి వస్తోంది!

వెంక: ఎలాగైనా చిన్నప్పటినుంచి చాలా కష్టాలుపడ్డావు నాయనా! బుద్ధిమంతుడవు కాబట్టి ఓపిగ్గా యిందరి తద్దినాలు విడవకుండా పెడుతున్నావు. మరొకడైతేనా.... చెప్పేదేముంది?

రమణ: మరేలెండి...అయితే నాయనమ్మ చనిపోయేటప్పటికి, ఏమైనా ఆస్తి మిగల్చిందాండి!

వెంక: ఆస్తా! రామ! ఆస్తి ఎక్కడిదోయి. ఉన్న ఆస్తి కాస్త మీ నాన్న పాడుచేశాడు కదా! ఇంతకాలం యీ ముసలమ్మను నా ఆదాయం పైనే పోషించాను.

రమణ: ఆవిడకు మూడెకరాలు పల్లిష్టస్వామి వుండాలని జ్ఞాపకం. అసలు ఏమీ లేదాంటి?

వెంక: స్వామి ఎక్కడిదిబాబు! నువ్వు వుద్యోగాలకు దూరప్రాంతాలకి వెళ్ళేటప్పుడు ఆవిడకు మూడు ఎకరాలు వుండడం నిజమే. కాని అవికూడా మీ నాన్న అనంతరపుహక్కుకు అమ్మేశాడుకదా! పైగా ఆ మూడు ఎకరాలు ఆ గవరయ్యకు కవులు యిచ్చాడు. 'యూ ఏడు పంటపండలేదని పంటలు మునుగులుపల్ల పాడైపోయాయని, ఏదో మిషపెట్టి, ఆ గవరయ్యగాడు ఏ ఏడూ యింతరొఖ్ఖంకూడా యిచ్చిన పాపానపోలేదు. నేనా ముసలివాణ్ణై పోయాను. కదలలేనివాణ్ణి. అందుచేత, నాకున్నదాంట్లోనే ఆ ముసలిదానికి పెట్టిపోషించాను.

రమణ: సరేలెండి,

[ పుల్లిప్ప, విశాలాక్షి ప్రవేశం ]

పుల్లి: ఏంరా! రమణమూర్తి! మీ నాయనమ్మ యింతలో యిలా చచ్చిపోతుందనుకోలేదు.

విశా: తొంభైఅయిదేండ్లు నిండేయిగా! యింకా ఎంతకాలం బ్రతుకుతుందేమిటి?

పుల్లి: నీకోసం ఆ ముసలిది ఎంత పలవరించేదనుకున్నావు? ఒక్కనాడూ వచ్చి చూడకపోయావు.

రమణ: ఎప్పటికప్పుడే వద్దామనుకుంటూండే వాణ్ణి. కాని ఉద్యోగంలో చేరాక తీరుబడి ఎక్కడిది?

పుల్లి: మీ నాయనమ్మవంటి మంచిమనిషి, అంత ఆచారవంతురాలు, మళ్ళీ యింక పుట్టదురా!

రమణ: ఏదేనండి.

పుల్లి: మా కందరికీ ఎంతో సహాయంగా సలహాదారుగా ఉండేది అన్ని విషయాల్లో. (దుఃఖంతో) ఆ పెద్దదిక్కు పోయినందుకు మాకెంత బాధగా వుందో!

రమణ: ఉంటుందండీ! అందరికీ వుంటుంది.

పుల్లి: వంట్లో సత్తువవున్న రోజుల్లో, మా యింట్లో ఏ కష్టం వచ్చినా, ఏ సుఖం వచ్చినా ముందుగావచ్చి ఆదుకునేది.

రమణ: అలాగాండి!

పుల్లి: నువ్వంటే ఎంత అభిమానమనుకున్నావు! కొడుకూ, కోడలూ చని పోవడం మూలాన వంశానికి నువ్వొక్కడవే మిగిలావని, నీ మీద పంచప్రాణాలు పెట్టుకొని చనిపోయింది.

సీతా: పాపం!

[పాలయ్య ప్రవేశం]

పాల: వచ్చావుటా నాయనా! మీ నాయనమ్మ నీకింత కష్టం కలిగిస్తుందను కోలేదు.

రమణ: ఏం చేస్తాంలెండి!

పాల: నే నెప్పుడూ మీ నాయనమ్మ దగ్గరే ఉండేవాణ్ణి! పాపం! మంచి మంచి అరటిపళ్ళన్నీ నాకు పెట్టి, కుళ్ళిపోయిన పళ్ళన్నీ తినేది మీ మామ్మ! నే నంటే ఎంత అభిమానమనుకున్నావు మీ నాయన మ్మకు! పైన మిగిలితే జాగ్రత్తగా పత్తిడబ్బాలో దాచి ఎవరికో ఒక రికి యిచ్చేది.

రమణ: ఆవిడకు అందరూ ఒకటేనండి.

పాల: సరే. నువ్వింతేకాదా చాలా పలవరించేది... ....అయినా యింత హఠాత్తుగా చచ్చిపోతుందనుకోలేదు. పడుకున్నట్లే పడుకొని యిట్టే ప్రాణం వదిలేసింది. చచ్చేకాలానికి నాకు తోడువుండే యోగమైనా లేకపోయింది.

వల్లి: యింతకీ ఆవిడ చాలా అదృష్టవంతురాలు.

[ సుబ్బమ్మ ప్రవేశం ]

సుబ్బు: (ఏడుస్తూ) మీ నాయనమ్మను పంపించేశావురా నాయనా! నీ కింత కష్టం వస్తుందనుకోలేదు.

రమణ: యిది పెద్ద కష్టమేమిటమ్మా: ఆవిడ చాలా పెద్దదైపోయింది. అందువేత చనిపోవడం సహజం.

సుబ్బు: అవునులే: కాని నీకు ఆ పెద్దదిక్కుకూడా లేకుండా పోయిందని నా విచారం.

రమణ: ఏం చేస్తాం! ఎవరు ఎన్నాళ్లు జీవించేయోగం ఉంటే అంతే.

సుబ్బు: అయితే అంత్యక్రియలు పన్నెండురోజులు యిక్కడే చేస్తావా?

విశా: యింకా ఏవీ నిశ్చయించలేదు.

సుబ్బు: ఏదో అందరం ఇక్కడే వున్నాం. నలుగురు బంధువులు యిక్కడికి రావడానికి వీలవుతుంది. అంత్యక్రియలు యిక్కడే చేస్తే ఆ ముసలమ్మ ప్రసాదం మేమంతా తిన్నవాళ్లమౌతాము.

రమణ: యీ వేళో రేపో ఏదో నిశ్చయిస్తాగా!

వెంక: నేనప్పుడే అందరికీ ఉత్తరాలు రాసేశాను. నువ్వువచ్చి యిక్కడే

పన్నెండు రోజులు అంత్యక్రియలు చేస్తారని. యిక్కడ చేస్తేనే మంచిదని నా సలహా:

సుబ్బ: వెంకటేశ్వర్లుకూడా పెద్దవాడై పోయాడు. వాడి అప్పు ప్రసాదం వాడికి ముక్తేటట్లుచూడు నాయనా! ఎంతోకాలం వాన్ని కనిపెట్టుకు చూశాడు.

పాల: మూర్తికే మాత్రం తెలియదూ యీ సంగతి. వాడేమైనా కుఱ్ఱవాడు. కనుకనా!

రమణ: అలాగే! ఆలోచించి చెప్తాను.

## 2వ రంగం

వెంక: ఏమే సుబ్బమ్మా! మనవాడిలో అసలు దుఃఖమే కనిపించటంలేదేం!

సుబ్బ: ముసలమ్మ చచ్చినందుకు పీడవదిలిందని సంతోషిస్తున్నాడేమో లోపల.

పాల: కంటినుంచి ఒక్క నీటిచుక్కైనా లేందే! యిదేం చోద్యమో!

శల్లి: ఏమో బాబు! మా కాలంలో ఎవరైనాపోతే- నిజంగా ఎంతకాలం ఏడ్చేవాళ్ళం. పెండేళ్ళదాకాపరామర్శచేయడానికి వచ్చినవాళ్ళముందు ఏడుస్తూ ఉండేప్పటికి కళ్ళకాయలుకాచి కంటి రోగాలుకూడా వచ్చేవి.

వెం: చచ్చిన ముసలమ్మ "పోనీ మంచిది. చనిపోయింది" అనైనా ఒక ముక్కకూడా అనలేదు. "ఎవరికెంతఋణమో అంతే" అంటాడు. యిదెక్కడి వేదాంతం! యీ మాత్రం వేదాంతం మనకు తెలియదటర్రా!

సాలి: మనకు యీ వేదాంతం తెలియకే యిన్నాళ్ల ఏడ్చేవాళ్ళమా? పరాయి వాళ్లకైనా ఏడుపువచ్చించటాని, ఆ మూర్తిగారు ఒక్కనిట్టూర్పు కూడా విడువలేదు.

సుబ్బి: ఈ కలికాలంలో కనిపించే వింతల్లో యిదొకటి.

పుల్లి: వెనక నాకు చిన్నతనంలో పదహారవఏటే ఆయన పోయారు, అప్పటికి నేను కాపురానికి వెళ్ళనేలేదు. కాని అప్పుడే నాకు జుట్టు తీయించి, సైనుపంచ యిచ్చారు. ఆ తర్వాత ఐదేండ్లదాకా వచ్చే వెళ్లేవాళ్ళ పరామర్శలతో పసుగెత్తి పోయిందనుకో! ఎవరైనా పరామర్శకు వస్తోంటే, మా అమ్మ నన్ను జాగ్రత్తగా కూర్చోపెట్టి ఏడ్వమనేది. చిన్నపిల్లని, నాకు ఎలా ఏడుపువస్తుంది? సాధారణంగా వచ్చేదికాదు. ఏడ్వడానికి కొంచెం నా కండ్లలో కారం రాసేది మా అమ్మ అప్పుడప్పుడు. లేకపోతే ప్రక్కనుంచి గిల్లిపిక్కు పెట్టేది: అప్పుడు ఏడ్చేదాన్ని. ఎలాగైనా నలుగురు పరామర్శకు వచ్చినప్పుడు కాస్త ఏడ్వకపోతే ఎలాగ?

సుబ్బి: కాదటమ్మా! అందులో యింటికి పెద్దది. అటువంటి నాయనమ్మ పోతే ఏడ్వకుండా వుండడం ఏమంత బాగులేదు. నాకూ ఆ మధ్య వైధవ్యం వచ్చిందా! అప్పుడు నీలాగే నాకూ పరామర్శచేయడానికి వచ్చేవారు, ఆయనపోయిన అయిదేండ్ల తర్వాత ఒకరోజు నేను భోంచేస్తూంటే మా పినతాతయ్య గబుక్కున పరామర్శకువచ్చాడు. వచ్చి "ఏమే సుబ్బి, నీ మొగుడు పోయాడటకదూ! " అని అన్నాడు, ఆమాట వినేటప్పటికి ఉలిక్కిపడ్డాను, అన్నం తింటున్నానేమో, గబుక్కున యేడ్వబోయే హడావుడిలో, అన్నంముద్ద

గొంతుకలోపటి పైకి కింపకుండాక నేనుకూడా చచ్చేటంత పనైంది.
చివరికి ఏడ్వాననుకో; తీరా ఏడ్వకపోతే లోకం ఏమనుకుంటుంది?
చచ్చినవాళ్ళమీద అసలు అభిమానమే లేదనుకోదూ లోకం?

వెంక: మా నాన్న పోయాక, ఆయిదేండ్లవాకా నేను యింటి బైటికి వెళ్ళే వాణ్ణేకాదు।

సుబ్బ: పైగా ఆ విశాలక్షిని చూశమ్మా! మొగుడు నాయనమ్మ పోయి నందుకు 'అయ్యో' అనికూడా అనలేదు.

పుల్లి: దాని కెందుకుంటుందే ఆ ముసలిదానిమీద అభిమానం.

వెంక: ముసలిది వాళ్లకేమీ యివ్వలేదని కాబోలు మూతులు ముడుచుకు కూర్చున్నారు.

పుల్లి: అయితే వెంకటేశ్వర్లూ! ముసలిది యేమీ వాళ్ళకివ్వలేదూ: అంత్య క్రియలు చేయాలంటే కాస్తాకూస్తా అవుతుందా? అధమం ఐదు వందలైనా కావాలి అగ్నిహోత్రంలాంటి మన కుటుంబం పరపతి నిలబెట్టాలంటే।

వెంక: రామ! రామ! ఒక్క కానీ యివ్వలేదర్రా! ఇవ్వడానికి దాని దగ్గర యేముంది? ఇన్నాళ్ళు నేనేగా పోషించాను దాన్ని.

పాల: అయినా మనుమడాయను! ఒక్కరోజైనా ముసలిదాన్ని చేర దీశాడూ! పెళ్లిచేసుకుని పెళ్ళాన్ని తీసుకొని ఉద్యోగానికిపోయాడు గాని. కొన్నాళ్ళు ముసలమ్మకు చాకిరీచేదామని బుద్ధిఐనా పుట్ట లేదుగా!

పుల్లి: పోనీలెద్దూ! అటువంటివాడికి ముసలిది ఏమన్నాయిచ్చినా తప్పే!

ప్రేమతో పెంపుచేసుకుని, తండ్రికిచ్చిన ఆస్తిఅంతా తండ్రి తగలె ట్టావా! యింక కొడుకుమాత్రం తగలపెట్టడని .యాకీ ఏమిటి?

సుబ్బు: మా బాగా అన్నావు పుల్లప్పా!

వెంక: అయితే అంత్యక్రియలు యెక్కడ చేస్తావు పుల్లప్పా! ఒకసారి నువ్వే కనుక్కుందుము !

పుల్లి: ఇంతకీ వాడిదగ్గర డబ్బుందో లేదో యిప్పుడు.

వెంక: పోబ్బునాయి. డబ్బులో వంద రూపాయలు తెప్పించుకుంటున్నాను నెలకి. ఆ మాత్రం నిలవ ఉండదూ?

సుబ్బు! ఏది ఏమైనా యిక్కడ పన్నెండు రోజులు అంత్య క్రియలు చేస్తే ఆ మనిషిఆత్మ తరిస్తుంది. పదిమంది తనవాళ్ళనే వాళ్ళకి భోజనం పెట్టినట్లూ ఉంటుంది. మనం మాత్రం ఊరికే వస్తామా! పరామర్శ చేయటం మన ధర్మం కాబట్టి, యీ పన్నెండు రోజులువుండి. పరామర్శచేసి వాళ్ళ కష్టాలు పంచుకొని, అంత్యక్రియలు చేయించి మరీ వెడతాము.

వెంక: సుబ్బమ్మా! కాస్త వాడితో చెబుమా! ఎలాగైనా కొంచెం చను వున్న దానివిగా!

సుబ్బు! అలాగే ప్రయత్నిస్తాను. రావే పుల్లప్పా! మనవాళ్ళని నలుగురినీ కలుసుకువద్దాం. (సుబ్బమ్మ, పుల్లప్ప నిష్క్రమణ)

పాల: యిదిగో: వెంకటేశ్వర్లు: నా వాటా నాకిస్తావా లేదా? లేకపోతే నీ సంగతి బట్టబయలుచెయ్యనా?

వెంక: ఉండరాబాబు! యీ పన్నెండురోజులు జరిగిపోనీ! తర్వాత నీ వాటా నీ కిచ్చేస్తాగా!

పాలి: అలా పనికిరాదు, నా కా సగం సౌఖ్యం యివ్వదలచుకున్నావా, యిప్పుడేయియ్యి. లేకపోతే....

వెంక: అల్లా గొడవపెట్టకు. ఇప్పుడు ఒక వంద రూపాయలు తక్షణం యిస్తాను. తక్కినది యీ పన్నెండు రోజులు అయిపోయాక యిస్తాను.

పాలి: అప్పుడు యిస్తావని నమ్మకమేమిటి! పైగా అప్పటికి నీ పనికూడా తీరిపోతుంది. నేను యీ విషయం అప్పుడు ఎవరితో చెబితే ఏం లాభం?

వెం: నీకు ఆ మిగిలిన నాలుగువందల రూపాయిలు యిప్పుడు యిచ్చేస్తే యీ విషయం గురించి వాళ్ళకి చెప్పవని నమ్మకమేమిటి? నీ డబ్బు నీకు దక్కిందికదా అని నన్ను బట్టబయలుచేస్తే!

పాలి: నా మీద నీ కామాత్రం నమ్మకం లేదన్నమాట!

వెంక: ఏం! నామీద నీ కామాత్రం నమ్మకంలేదూ! యీ పన్నెండురోజులూ ఆగు. వాళ్ళంతా వెళ్ళిపోయాక నిశ్చింతగా మన వాటాలు మనం పంచుకోవచ్చు.

పాలి: సరేలే! నిన్ను నమ్మి ఊరుకుంటున్నాను యిప్పటికి.

## 3వ రంగం

విశా: రామ! రామ! యిటువంటి దౌర్భాగ్యులనుకోలేదండి మీ బంధువు లంతా!

రమణ: ఏమయింది?

విశా: మీ నాయనమ్మ పోయినందుకు మీరు సరిగ్గా ఏడ్వనైనా లేదుట. మీకు ఆవిడమీద అభిమానమే లేదుట.

రమ: ఎవరంటున్నారు?

విశా: యింకెవరు: ఆ వెంకటేశ్వర్లు వాడి ప్రతాపే కలిసి అంటున్నారు.

రమ: నీ కెలా తెలిసింది?

విశా: ఆ మాత్రం గూఢచర్యం చెయ్యలేకపోతే మీకు భార్యనై ఉండడం ఎందుకండి! వాళ్లు మాట్లాడుకుంటూంటే ప్రక్కనుంచి పొంచి విన్నాను.



రమ: మంచిపని చేశావులే.

విశా: నన్ను మెచ్చుతారెందుకు? వాళ్లు చేసినపని బాగుందేమిటి?

రమ: నేనుమాత్రం బాగుందన్నానా? ఎవరికి ఎలా ఏడ్వడం యిష్టమైతే అలా ఏడుస్తారు. అయినా నిత్యమూ చావులుచూసే నాలాంటివాడికి యిటువంటి చావు లెక్కలేదు. అందులో ముసలి మనిషిపోతే పెద్ద ఏడ్వవలసిన అవసరం ఏముందీ! ఇరవైఅయిదు ఏండ్లు నిండలేదు, అప్పుడేనల్గురికి దహన క్రియలు చేశాను. నాన్నకి, అమ్మకి, తాతయ్యకుఅమ్మమ్మకు. ఇది ఐదోది, ఇన్ని కష్టాలు కళ్ళార చూస్తూంటే గుండె రాయి అయిపోతే, యిక కంట నీళ్ళెలా కారుతాయి! పైకి ఎంత గట్టిగా ఏడుస్తే అంత దుఃఖం ఉందనుకుంటుంది లోకం. దుఃఖం లోపల దిగమింగుకునే వాళ్ళ సంగతి ఏం తెలుస్తుంది లోకానికి?

విశా: ఆ సంగతి నాకు తెలియక అన్నానటండీ! వాళ్లు యిలా అంటున్నారని చెప్పాను కాని,

రమ: నిన్ను మాత్రం ఏమంటున్నాను, అసలు సంగతి వెళ్ళబోసు కున్నాను.

విశా: యీ పన్నెండు రోజులు అంత్యక్రియలు జరిగితే పడితిందామని గుంపులు గుంపులుగా వస్తున్నారు మీ బంధువులంతా. మీరు పట్నంలో వందరూపాయలు సంపాదిస్తున్నారట. ఏదో యింత డబ్బుమూట మీదగ్గర ఉందని వాళ్ళ ఊహ.

రమ: పల్లెటూరివాళ్ళకు పట్నవాసాల సంగతి ఏమి తెలుస్తుంది? పల్లెల్లో పదిరూపాయలతో సంసారాలు కాలక్షేపం చేయగలుగుతే, పట్నాల్లో వందరూపాయిలైనా కూటికి గుడ్డకి చాలవు. అయినా వాళ్ళ దృష్టిలో యీ 'వంద' అంకె చాలా గొప్ప.

విశా: అయితే అంత్యక్రియల సంగతి ఏం చేదాం. మీ నాయనమ్మ అంత్యక్రియలకైనా డబ్బిచ్చి చనిపోతుందనుకున్నా మే!

రమ: అదే నేనూ ఆలోచిస్తున్నాను.

విశా: మీ నాయనమ్మ పీనాసి అని చెబుతారు. చనిపోయేటప్పటికి ఒక అయిదువందలు రూపాయిలైనా దాచదుటండీ! అసలు ఆ వెంకటేశ్వర్లు అమిగిలిన డబ్బుకాస్త 'గుటకాయస్వాహా'చేసి ఉంటాడండీ!

రమ: ఏం చేస్తాం! అంతామన అదృష్టం!

విశా: అలా అనకండి. యిందాక పాలయ్య వెంకటేశ్వర్లు కలిసి ఏవో గుసగుసలాడు కుంటున్నారు. పాలయ్య 'నా సగంవాటా యిస్తావా లేదా' అంటున్నాడు. వెంకటేశ్వర్లు 'యిప్పుడు వంద రూపాయలు తీసుకో. తరువాత నాలుగువందలురూపాయలు వీళ్ళంతావెళ్ళేక యిస్తా ము' అంటున్నాడు. 'ఇది జాగ్రత్తగా పరిశీలిస్తే ఏదో వ్యవహారంలో

పిన్నిగారికి చెరిసగం అయినపుడు హావభావాలు పాటా ఉన్నట్లు కనిపిస్తోంది.

రమ: వాళ్ళకి ఏం వ్యవహారాలున్నాయో మన కెందుకు ఆ గొడవలు.

విశా: అది కాదండి. పైగా వెంకటేశ్వర్లు 'యీ పన్నెండురోజులు నాది పని' అంటున్నాడు. దీన్నిబట్టిచూస్తే మనకి సంబంధించిన విషయం ఏమన్నా ఉందేమో అని నా అభిప్రాయం.

రమ: మన విషయం ఏముంటుందే!

విశా: ఆ ముసలమ్మ చనిపోతూ, మీకేమైనా డబ్బు యిచ్చిందేమో అని నా అనుమానం.

రమ: అయితే యిప్పుడు మనమేం చెయ్యగలం. దేనికైనా ఋజువు ఉండాలిగా!

విశా: నాకో ఆలోచన తట్టుతోంది. ఇదిచేస్తే వెంకటేశ్వర్లు నోటిద్వారానే వస్తాయి అన్ని విషయాలు. పైగా మీ నాయనమ్మగారిపై మీకు అభిమానం లేదనే అపవాదుకూడా పోతుంది.

రమ: ఏమిటది?

విశా: వెంకటేశ్వర్లుకు దెయ్యాలంటే భయము, నమ్మకము, ఉందని చెప్పావుగా నాతో ఒక సారి!

రమ: అవును.

విశా: మీరు (మెళ్ళో బంగారపు గొలుసు తీసి) యీ గొలుసు వెంకటేశ్వర్లుకు యిచ్చి ముసలమ్మ అంత్యక్రియలు చెయ్యడానికి ఏమన్నా డబ్బు అప్పు తెమ్మని చెప్పండి, అంత్యక్రియలు యిక్కడే చేద్దామనుకుంటున్నాం అని చెప్పండి. తక్కిన విషయాలు నేను చక్కబెడతాను.

రమ: నాకేమి అర్థంకావటం లేదు నీ మాటలు.

విశా: నే చేస్తాగా అన్ని పనులు!.........ఊరుకోండి. సుబ్బమ్మవాళ్ళు వస్తున్నారు.

(సుబ్బమ్మ, పుల్లప్ప ప్రవేశం)

సు: ఏంరా, మూర్తీ! అంత్యక్రియలు యిక్కడే చేస్తారా?

విశా: యిక్కడనే చేయాలను కుంటున్నాం. కాని ఆయనకు జరూరు ఆఫీసు పనులున్నాయి. పట్నం వెళ్ళి పోవాలేమో అంటున్నారు.

పు: ఆఫీసు పనులు ఎప్పుడూ ఉంటాయి నాయినా. మేమంతా పెద్దవాళ్ళ మయ్యాం. ఆ ముసలమ్మ ప్రసాదంకూడా మాకుపెడితే సంతోషిస్తాము.

విశా: అదే నేనూ చెబుతున్నాను, యిప్పుడు మాదగ్గర డబ్బు లేదు. అప్పు అడిగితే వెంకటేశ్వర్లు తన దగ్గిరకూడా ఏమీ లేదన్నాడుట. పోనీ యీ గొలుసు తాకట్టుపెట్టి ఆ వెంకటేశ్వర్లుగారు ఏమన్నా అప్పుతెస్తారేమో అని యిప్పుడే ఆయనతో అంటున్నాను.

సు: దానికేమమ్మా! యీవూరి మునసబు నడిగితే యిట్టే యిస్తాడు. అయిదువందల రూపాయలు యీ గొలుసు తాకట్టు పెడితే, తప్పకుండా చేయండి ఆపని.

పు: ఇదుగో! వెంకటేశ్వర్లు యిలాగే వస్తున్నాడు.

(వెంకటేశ్వర్లురాక)

రమ: వెంకటేశ్వర్లుగారూ! అంత్యక్రియలు యిక్కడ చేస్తేనే బాగుంటుందనుకున్నా. మీరు ఈ గొలుసు తాకట్టుపెట్టి కొ_స్త అప్పు తెచ్చిపెట్టితిరా యీ అంత్యక్రియలు పూర్తిచేయించిన వారవుతారు!

వెం: అంతకన్నానా నాయనా! తప్పకుండా! ఎవరికైనా ఇబ్బందులు కష్టాలు సహాయం చెయ్యడం మానవధర్మం.

విశా: (వెక్కి వెక్కి ఏడుస్తుంది)

వసు: ఎందుకే ఏడుపు? గొలుసు మళ్ళీ విడిపిస్తాగా!

షా: పర్వాలేదమ్మా! ముసలమ్మ స్వర్గంలో ఎంతో సంతోషిస్తుంది నీ ఉదారత్వానికి. సకల శుభాలు మీకు కలగాలని దీవిస్తుంది.

విశా: (గట్టిగా అరచి బాధతో)...ఏదో బరువు మీద పడినట్టుందండి. అమ్మో. అబ్బా...

అందరు: ఏమిటి? ఏమిటి? (అని కంగారుగా పరిచర్య చేస్తూంటారు)

విశా: (వికృతిగా, దెయ్యం పట్టినట్లు అరుస్తూ) ఏరా! వెంకటేశ్వర్లూ! నేను చచ్చిపోయాననుగదా అని అంత ద్రోహం చేస్తావురా! మహాలక్ష్మివంటి నా మనుమరాలు మెడలోని గొలుసు తీయిస్తావుటా?!

వెంక: (ఆశ్చర్యంగా) ఏమిటి! యిలా మాట్లాడుతోంది యీవిడ.

విశా: నన్ను మర్చిపోయావట్రా..! ఇల్లాగే వుంటుంది నీ అభిమానం నా మీద! నేనురా వెంకమ్మని!

వెంక: (ఆశ్చర్యం, భయంతో) వెంకమ్మ! వెంకమ్మ....

విశా: అవునురా! అప్పుడే మర్చిపోయావట్రా! నీ అక్కనిరా!

వుల్లి: (దవడలు నొక్కుకుంటూ) ముసలమ్మలావుంది. పదో రోజైనా దాటలేదు. విశాలాక్షిని పట్టుకొని కనిపించిందేం చెప్మా:

సుబ్బ: అయ్యో పాపం! ఇంకా గాలిరూపంలోనే ఉందన్నమాట!

వుల్లి: అంత్యక్రియలైనా కానిదే గాలిరూపం ఎలాపోతుంది:

సుబ్బ: అయినా, యింకా ఏం కోరిక లున్నాయో!

వెంక: (కంగారూ, భయంతో) ఊఁ....ఊఁ... అయితే,

విశా: అయితే, గియితే ఏమిటి ? నా మనవణ్ణి మోసంచేస్తావుటరా! యింకా నిన్ను నమ్మవచ్చునుకుని నీకే డబ్బుయిచ్చినందుకు యింత దగా చేస్తావా?

వెంక: దగా! నేనేం దగాచేశాను?

రమ: ఏం! సుబ్బమ్మత్తయ్యా! [ఆశ్చర్యంతో ] ముసలమ్మ పట్టుకుందా ఏమిటి మా ఆవిడను!

సుబ్బ: మరింకేమిటి నాయనా! అలాగే కనిపిస్తోంది. ఊరుకో! ఇంకాఏమంటుందో చూదాము.

విశా: నేనిచ్చిన డబ్బు వాళ్లకివ్వలేదేం?

వెంక: [కంగారు, భయంతో] డబ్బు—డబ్బు...నే తీసుకోవడ మేమిటి ........డబ్బు....!

విశా: నే చచ్చిపోయానుకదా అని అబద్ధమాడుతావటరా ! నీ వంశ నాశనము చేస్తారోయి! నీ కూతురు కడుపుతో వుందిగా! దాన్ని పీల్చి పిప్పిచేసేస్తారోయి! తెలియటల్లేదూ! [ఏడుపుతో] నా కోరికలు తీర్చకుండా నన్ను యింకా యిలా "గాలి" రూపంలో అట్టే పెడతావుటరా!

వెంక: (భయం, కంగారు, హడావిడితో కూడిన మౌనం)

విశా: చెప్పు! ఆ డబ్బు ఎక్కడుంది? మనవడి కిచ్చేయి!

వెంక: అఁఅఁ...

పు: సు: చెప్పరా వెంకటేశ్వర్లు! ఏమన్నాడబ్బిచ్చింవా నీకు ముసలమ్మ తన మనమడికిమ్మని!

విశా: మాట్లాడవేం!....లేకపోతే నీ వంశనాశనం చేస్తారోయి. నిన్ను చచ్చేలోపుగా నానా యాతనలుపెట్టి పీల్చి పిప్పిచేస్తారోయి!

వెంక: వద్దే అవ్వ!...వద్దు....చెప్తాగా! యీ అంత్యక్రియలు పన్నెండు రోజుల్లో పంపకాలు, డబ్బువిషయాలు గురించి మాట్లాడకూడదని మూర్తికేమీ చెప్పలేదు. ఇచ్చేవుగా నువ్వు! యిచ్చేవు డబ్బు!

పుల్లి: అయితే ఎంతయిచ్చిందిరా!

వెంక: ఒక....

సుబ్బి: సరిగాచెప్పు వెంకటేశ్వర్లు! ముసలమ్మకు కోపం తెప్పించకు!

వెంక: ఒక వెయ్యి యిచ్చింది.

విశా: ఆఁ....ఇచ్చానా! ఆ డబ్బు యియ్యి మనవడికి.

సుబ్బి: అయ్యో ఎంతపని జరిగింది. పాపం! వెంకమ్మా నువ్వు అట్టే దిగులుపడకు. మేం ఉన్నాంగా! అన్నీ చక్కబెడతాము. పాపం! మా విశాలాక్షిని యింక వదిలేయి.

విశా: ఏంరా మూర్తీ! కులాసాగా ఉన్నావా నాయనా!..... నా పని అయి పోయింది.... అంత్యక్రియలు జాగ్రత్తగా చెయ్యేం నాయనా! లేక పోతే నాకు 'గాలి' రూపంపోదు.

రమణ: అలాగే మామ్మా!

విశా: ( ఆయాసంతో హఠాత్తుగా పడిపోతుంది ) ...ఊఁ...ఊఁ...దాహం...(నీరసంగా) నీళ్ళు....నీళ్ళు...

పుల్లి: కొంచెం మంచినీళ్ళు తెండర్రా పాపం!

వెంక: పొరపాటయిందిరా నాయనా! 12 రోజులు దాటేక, నీకా డబ్బు యిద్దామనుకున్నాను. యీ కష్టకాలంలో పంపకాలు, డబ్బు విషయాలు మాట్లాడకూడదనుకదూ! అందుచేత నీకా డబ్బు యివ్వలేదు.

రమణ: పోనీలెండి. దానికేం.

వెంక: ఇంక యీ గొలుసు యెందుకు? విశాలాక్షికిచ్చేయి. నీ డబ్బు యిప్పుడే యిస్తాను. [నిష్క్రమణ]

పుల్లి: పాపం! మనమడంటే ముసలమ్మకు యెంత అభిమానమో, యిట్టే కనిపించింది.

సుబ్బ: కాదుటే! దానికి మాత్రం తెలియదూ! మనమడు అంత్యక్రియలు చెయ్యాలని అభిమానంగా యిక్కడకు వచ్చాడని.

పుల్లి: మూర్తికి ముసలమ్మ మరణంవల్ల యెంత దుఃఖం, అభిమానం లేకపోతే, ముసలమ్మ విశాలాక్షిని పట్టుకొని యిలా కనిపిస్తుంది ?

సుబ్బ: కాదు మరీ! మనమంతా ఏమిటో అనుకున్నాం గానీ!

పుల్లి: మూర్తి! కొంచెం దాని దగ్గరవుండి నాల్గూ కావలసినవి చూడు నాయనా!.... ముసలమ్మ అంత్యక్రియలు యిక్కడే చేస్తావుగా!

రమణ: ఇక్కడే చెయ్యాలని వుంది.

పు:సు: మేం అలా వెళ్ళి, మళ్ళీ వస్తాము. [నిష్క్రమణ]

రమణ: మహాబలేపని చేశావే!...వాడు యిట్టే భయపడి సంగతిచెప్పేశాడే!

విశా: మరేమిటనుకున్నాడు. లేకపోతే మనకు రావాలిసిన డబ్బు, వాడు దొంగిలించడం ఏం న్యాయమండీ!

రమణ: ఎలాగైనా నీది చదువుకున్న తెలివితేటల బుర్ర.

## 4వ రంగం

పాలి: ఏం వెంకటేశ్వర్లూ! ఆ డబ్బు అంతా మూర్తికి యిచ్చేశావుట!

వెంక: ఏం చేస్తారా! ఆ ముసలమ్మ విశాలాక్షిని పట్టుకుని కనిపించి 'నీ వంశ నాశనం చేస్తాను, నా డబ్బు యివ్వకపోతే' అని బెదిరించిందిరా!

పాలి: చచ్చిన మనిషి బెదిరిస్తేమాత్రం ఏం చెయ్యగలదు!

వెంక: బాబోయి! అలామాత్రం అనకు. ఎంతమంది చచ్చిపోయి దెయ్యాలయి, వంశాలు పీకిపీకి పిచ్చి పిప్పిచేశారు! నాకు వున్నదే ఒక్క కూతురు. దాన్ని చంపితే నేనేం చేసేది. పైగా యిప్పటిదాకా సంపాదించిన డబ్బు ఎవరికిచ్చేది! అందుచేత, ఆలోచించి, యీ గొడవ నాకెందుకని, వాడి మొహాన పారేశాను ఆ వెయ్యి రూపాయలు. అసలే ఆ ముసలిది పీనాసి. దాని కోరికలు తీరకపోతే, బ్రహ్మరాక్షసిగా మారి, పీకుతుందేమో, అని నా భయం.

పాలి: అయితే నా వాటా పోయిందన్నమాటేనా!

వెంక: నేనేం చెయ్యగలను? నన్ను అనవసరంగా యింతకాలం 'నీసంగతి బయట పెడతా' అని బెదిరించినందుకు నీ కిది తగిన ఫలితం.... యిప్పుడు యీ డబ్బు నీకూ నాకూ కూడ దక్కలేదు.

పాలి: నీకేం! ముసలమ్మ చాకిరీ పేరుతో దాని డబ్బంతా నువ్వే తినేసే వాడవుగా యిన్నాళ్ళు! ఎటొచ్చి నాకేనష్టం.

[పుల్లప్ప, సుబ్బమ్మ ప్రవేశం]

పుల్లి: ఇంక నేనెందుకు? వెంకటేశ్వర్లూ! యింటికి వెడతాను. అంత్య

క్రియలు యిలా ముగుస్తాయనుకోలేదు. మన బంధువులంతా యింటికి పోతున్నారు.

పాలు: ఏం! అలా అంటున్నావు పుల్లప్పా!

పుల్లి: మూర్తి వెళ్ళిపోయాడుగా! పట్నంనుంచి వాళ్ళ ఆఫీసువాళ్ళు టెలి గ్రాం యిచ్చేరుట జరూరుపనులున్నాయి రమ్మని. అందుచేత మూర్తి, విశాలాక్షి, పట్నం వెళ్ళిపోయారు అక్కడే ముసలమ్మకు అంత్యక్రియలు చేస్తామని.

పాలు: టెలిగ్రాం! యిప్పుడు టెలిగ్రాం ఎక్కడినుంచి వచ్చింది? మూర్తి యీ పన్నెండురోజులు సెలవుపెట్టేనన్నాడుగా. ఇది అంతా విశా లాక్షిమాయ. ఇక్కడ అంత్యక్రియలుచేస్తే మనమంతా తినిపోతా మని వాళ్ళభయం. అబ్బో! ఆ అమ్మాయి చదువుకున్న పిల్లరా!

సుబ్బ: ఏది ఏమయితేనేం! నాకు ముసలమ్మ ప్రసాదం దొరికేయోగంలేదు దీనికోసం, ఖర్చులు పెట్టుకొని పట్నందాకా ఎవరు వెళ్ళగలరు?

పుల్లి: వెంకటేశ్వర్లు! ఒక్క ఐదు రూపాయలుంటే యివ్వరా! .... యీ వూరు వస్తోంటే, రైల్లో నా కొంగుముడి ఎవరో కత్తిరించేశారు. ముప్పయి రూపాయలు పోయాయి. తిరిగి యింటికి వెళ్ళడానికి ఒక్క పైసకూడ లేదు నా దగ్గిర.

వెంక: పాపం! నేనేం చెయ్యగలను పుల్లప్పా! నా దగ్గరకూడా ఒక్కపైస లేదు.

పుల్లి: యింటికి వెళ్ళేక పంపించేస్తా.

వెంక: నువ్వు పంపించవనికాదు. నా దగ్గర డబ్బులేదంటున్నా నా!

పుల్లి: సరే.... యింక ఎవరినైనా అడగాలి.

పుఃసుఃపాః వెళ్ళివస్తాం. వెంకటేశ్వర్లూ!

[పాలయ్య, పుల్లప్ప, సుబ్బమ్మ నిష్క్రమణ]

వెంకః మంచిది...యీ పరామర్శకు వచ్చేవాళ్ళకి పెట్టుబడికూడా నేనెక్కడ పెట్టగలను? అసలు నాకేమైనా లాభముంటేగా! ముసలమ్మ చనిపోయేటప్పుడు పాలయ్య ఒక్కడేకదా దగ్గర వున్నాడు. వాడికి సగం వాటా యిస్తే, తక్కిన ఐదువందల రూపాయిలైనా నాకు దక్కుతాయనుకున్నాను. ముసలిది యింకా యిలా దెయ్యమై కలిపిస్తుందని నాకేం తెలుసు...లేకపోతే ఆ పాలయ్యగాడు అన్నట్లు కొంపదీసి, దెయ్యంపట్టడంకూడా విశాలాక్షి మాయకాదుగదా! ....అయినా యిప్పుడేం చెయ్యగలను!!!

పాత్రలు :

1. సత్యం :
2. రామశర్మ : } భార్య భర్తలు
3. సరళ : రామశర్మ భార్య
4. కనకమ్మ : రామశర్మ తల్లి
5. కాంతమ్మ : సత్యం తల్లి
6. ఆచారి : రామశర్మకు పొరుగింటి స్నేహితుడు.

## 1 వ రంగం

[తుపాను.... గాలివాన—తప్పుల టకటకలు - దూరంనుంచి నక్కల కూతలు ]

సరళ: (వెక్కి వెక్కి ఏడ్పులు)

రామ: (రౌద్రంగా) వెళ్ళు, ఇంక నా గుమ్మం తొక్కకు. పో. మీ అమ్మ వెనకాల పో. నా మాటకు ఎదురుచెప్పేభార్య నా కక్కరలేదు. నీ సామానులు గిరగిరా త్రిప్పి అవతల పారవేస్తా. (పెట్టెలచప్పుళ్ళు) తక్షణం పో. పో, నా గుమ్మం (త్రొక్కకు)

సర: (దుఃఖంతో) నేనేంపాపం చేశానని నన్ను పొమ్మంటారు? చేతిలో కాని లేక యిబ్బందిపడుతున్న యీ దరిద్రపు రోజుల్లో, యిప్పుడు సినీమాకి వెళ్ళడమెందుకన్నాను. ఎందు వెళ్ళాలని వుంటే ఒక్కరినీ వెళ్ళమన్నాను. డబ్బు ఖర్చు ఏందుకని. దానికోసం యింత రాద్ధాంతంచేస్తారా? యీ తుపానులో నిశీధంలో ఎక్కడికి పొమ్మంటారు మమ్మల్ని!

రామః (అరుస్తూ) నా కథంతా తెలియదు. నా మనస్సుకు శాంతిలేకుండా చేసి పీడించే రాక్షసివి నువ్వు. తక్షణం ఫోఫోఫో !

సత్యం: (కోపంగా) ఫోఫో. అంటూంటె నీ గుమ్మంలో ఒక్క క్షణం వుండేవాళ్ళం గాము. దసరాకి సరదాగా రమ్మని ప్రాధేయపడితే నీ గుమ్మంలోకి వచ్చాము. మాకూ ఆత్మగౌరవం వుంది. నీగుమ్మంలో పడిగాపులు పడే అవసరం మాకు లేదు. ...రా చెల్లాయి! నిత్యం గృహకల్లోలాలు పెంచి, చావగొట్టి చెవులుమూసే యిటువంటి భర్తతో కాపురంచేసేకన్న గంగలో దిగి చస్తే మంచిది.

కన: ఎంతంత మాటలంటున్నావురా ! యీశావా కాంతం ! నీ కొడుకు పోగడు! (ఏడుస్తూ)......నా కొడుకును మీరంతా నాశనం చేస్తున్నారోయి! నా కొడుకును నవ్వులపాలు చేస్తున్నారోయి!

(గగ్గోలు)

కాంత: (శాంతంగా) ఒరే సత్యం, నువ్వూరుకో శర్మ! యీ అర్ధరాత్రి హోరుగాలిలో ఎక్కడికిపోతాం. కొంచెం శాంతించు. పిల్లమాత్రం ఏ మాటలు అన్నదని మమ్మలిని అందరిని యింట్లోంచి పొమ్మంటావు! తెల్లవారగానె మేము పోతాం. పిల్ల నీతో కాపురం చెయ్యవలసినది. దాన్నికూడా పొమ్మంటె ఎక్కడకు పోతుంది.

రామః గంగలో దిగమనండి. నేను దీనితో కాపురం చెయ్యలేను- ఇది నా యింట్లో ఒక్కక్షణం వుండడానికి వీలులేదు. భర్తనయ్యాక రెండు దెబ్బలువేసే అధికారం లేదూ నాకు! అందుకోసమని ప్రపంచానికి తెలిపేటట్లు గొల్లుమని ఏడుస్తుందా!.... .... ఈ నాటితో దీనికి నాకు సంబంధాలు అఖరు!

సర: (వెక్కి-వెక్కి ఏడుపు)

సత్య: హు! రెండు దెబ్బలు వేసేడు: ఒళ్ళు హూనమయ్యేటట్లు చావ గొడుతూంటె, మేము అడ్డుపడ్డందుకు ఈ ఆక్రోశం. భార్యను చావగొట్టడం పురుషుడుచేసే ఘనకార్యం కాదు.

రామ: చాల్లేవోయి! నువ్వు పెద్ద ఘనకార్యాలు చేశావు: నీ పెళ్ళాంవచ్చాక నువ్వు కొట్టకుండా వుంటే నే చూస్తాగా: (అటుస్తూ) పొండి. తక్షణం నా యింట్లోంచి పొండి. పొండి.

సర: (వెక్కి-వెక్కి ఏడుపు)

కన: ఒసే సరళా! యిలారా.

సర: అత్తయ్యా! నీ పాదాలు పట్టుకు బ్రతిమాలుతా: నే నెక్కడికి పోలేది. నేను యీ యింట్లోనే వుండవలసిన దానిని.

కన: చాల్లే. నీ లాంటి గయ్యాళి కోడలిని ఎక్కడా చూడలేదు. వాడిని చీటికి మాటికి యిలా వేధించుకు తింటూంటే వాడు బ్రతకాలా!

(నగలు చప్పుడు)

కాంత: అదేమిటమ్మా! మంగళవారంపూట కాపురంచేసే పిల్లమెళ్ళో నగలు తీసేస్తావు.

కన: మీరేం తక్కువ వాళ్ళుటమ్మా! తినడానికి టికాణాలేనివాళ్ళు. దీనిని నగలతో వదిలితే, యివి అమ్ముకు తినకుండా వుంటారూ!

సత్యం: అత్తయ్యా! మాటలు జాగ్రత్తగా రానీ. మేమూ ఒకప్పుడు ఆస్తిపరులమే. మాకు దిక్కులేక, మీ భోగభాగ్యాలు ఆశించి పిల్లనివ్వ లేదు. పిల్లనివ్వకపోతే విషంత్రాగి చస్తానని పెళ్ళిచేసుకున్నాడు నీ కొడుకు.

కన: ఆఁ.... పొగరుమోతులు ఎవాసపడితే అలా వాగుతారు.

రామ: ఇదిగో చెబుతున్నాను. తక్షణం యింట్లోంచి పొండి.. పొండి, పొండి పోరంతా.

సర: ఏమండీ! నా మీద జాలిలేదా! (ఏడుస్తుంది)

రామ: ఫో! గయ్యాళి పీనుగ! ఫో!

ఆచారి: శర్మగారూ! మీ ప్రవర్తన బాగులేదు, ఆ అమ్మాయి, మీ అత్తగారు యీ అర్ధరాత్రి తుపానులో ఎక్కడికి పోతారు.

రామ: చాల్లేవయ్యా! నువ్వు పెద్ద జడ్జిగారిలా తీర్పు చెప్పవచ్చావు ! !

కన: పోవే! ఇంకా యిక్కడే వున్నావు! ఫో!

రామ: పొండి. శనిగ్రహాలు నా యింటినుంచి పొండి. పొండి.

[ తలుపు భళ్లున మూసినచప్పుడు ]

ఆచారి: కాంతమ్మగారు! యీ రాత్రికి మా యింట్లో వుండండి. తెల్లవారేక మీరు మీవూరు భద్రంగా వెళ్ళే ఏర్పాటు చేస్తాను..... (జాలిగా) నాలుగేండ్లక్రితం మా అమ్మాయినికూడా యిలాగే వెళ్ళగొట్టాడు నా అల్లుడు, యిప్పటికి ఆమె సంసారం బాగుపడలేదు.

సర: అమ్మా!...అమ్మా! (ఏడుపు)

కాంత: ఏం చెయ్యగలను తల్లీ! నా కడుపున పుట్టినందుకు నీ కిన్నికష్టాలు వచ్చాయి.

సత్య: (కోపంగా) నీ కడుపున పుట్టినందుకుగాదు. నువ్వు చేతులారా చేసిన పెళ్ళిఫలితం.

ఆచారి: సత్యంగారు! కొంచెం శాంతించండి. గృహకలహాలు నిత్యమూ

ఫుండిపోవు. క్రమంగా అవె సర్దుకుంటాయి.

సత్య: చెల్లెలు కాపురానికి వెళ్ళిన ఐదు సంవత్సరాలనుంచి చూస్తున్నాను. ఈ కర్కోటకుడు చెల్లెలిని యమయాతనలు పెడుతున్నాడు. ఇటు వంటి దుర్భర సంసారజీవితాలు గడిపే బదులు పెళ్ళిళ్ళమాని ఒంట రిగా బ్రతకడం మేలు,

[గుసగుసలు]

తన: ఒరే! దాన్ని పొమ్మన్నావు! అది యింక రాదేమో!

రామ: ఎవరికోసంవస్తుందే. దాని సంగతి పూర్తిగా తెలుసు నాకు, తిరిగి నా కాళ్ళదగ్గరికి వస్తుంది. అంతగా రాకపోతే, అది వెళ్లిపోయే టప్పుడు తిరిగి పిలుస్తాగా! [తుపాను తీవ్రత హెచ్చుతుంది] మర్నాడు:

[ఈదరగాలి...కోడికూత....బండిచప్పుడు]

ఆచారి: ఎక్కండి బండి. యింకో గంటలో రైలు వస్తుంది.

సర: అమ్మా....[ఏడుస్తూ] నా గతి యింతేనా!

సత్య: ఇంటికి పోదాం రా చెల్లాయి! ఎన్నాళ్ళు పడతావు యీ బాధలు. నీ భర్తకే నువ్వు కావలిస్తే అతనే వచ్చి నిన్ను తీసుకు వెడతాడు.

రామ: [కటువుగా] సరళా!

సర: [సంతోషంతో] అమ్మా! ఆయన పిలుస్తున్నారు. వస్తా.

[పాదాల చప్పుడు]

రామ: వెళ్ళిపోతున్నావా?

సర: లేదండి, మిమ్మల్ని విడిచి ఎక్కడికి వెళ్ళను.

రామ: నువ్వు వెళ్ళకు. మీ అమ్మను, అన్నయ్యను పొమ్మను. వాళ్లు యిక్కడ వుండడానికి వీలులేదు.

సర: పోనీలెండి వాళ్ళు వెళ్ళిపోతారు..... అమ్మా! మీరు వెళ్లండి. నేను రాను.

సత్య: చెల్లాయి! నా మాట విను! వచ్చెయి! మేము వెళ్ళిపోయాక అతను మళ్ళీ నిన్ను బాధపెడతాడు.

సర: నేను రాను మీరు వెళ్లండి

కాంత: బండి ఎక్కు సత్యం. వాళ్లిద్దరూ సుఖంగావుంటే అంతేచాలు

[బండి కదలిన చప్పుడు]

కన: ఏమే గయ్యాళి! మళ్లీవచ్చావు యింట్లోకి!

సర: ఆయనే రమ్మన్నారు అత్తయ్యా!

కన: వాడు రమ్మన్నాడూ! వాడెవడే రమ్మనడానికి!.... .... అంటే నువ్వు రాదలుచుకోలేదన్నమాట!...—అసి, శిఖండి! ఎంతకైనా తగిన దానవే!

సర: నన్ను అలా అంటారెందు కత్తయ్యా!

కన: అల్లాగయితే నేనే ఎంతకైనా తగినదాననంటవా!...ఒరే చూశావా దీని మాటలు, (ఏడుస్తూ)............నేను ఎంతకైనా తగుదునట! గయ్యాళిదానినట!!

రామ: సరళా! (అరుస్తూ) ఏమిటి ఆ వాగుడు!

సర: నేనేమీ అనలేదండి.

కన: అబద్ధాలు ఆడతావెందుకూ!

రాము: నీకు లగిలిన దెబ్బలు చాలలేదూ! నిన్ను చంపేస్తాను, నరికేస్తాను. నీ దిక్కున్నచోట చెప్పుకో! (అరుస్తూ బడితెతో బాదిన చప్పుడు)

సత్య: (ఏడుస్తూ) నేనేమనలేదండి...(దెబ్బలు)....నన్ను రక్షించండి. మీ పాదాలు పట్టుకుంటా! (దెబ్బలు)....బాబోయ్!...అమ్మోయ్! ....నే...ను... ఏమీ...అనలేదండీ....(ఏడుపు వెక్కివెక్కి)

[ఈదరగాలి రేగుతూంటుంది. వాన....ఉరుములు]

## 2వ రంగం

[ నెలరోజుల తర్వాత ]

కాంత: సత్యం! అమ్మాయికి టైఫాయిడు జ్వరం చాలా తీవ్రంగా వుంది. వాళ్లు దాన్ని తిన్నగా చూస్తారన్న నమ్మకం నాకులేదు. మనం కూడా ఆ పూట వెళదాంపద.

సత్య: ఎందుకమ్మా! అక్కడికి వెళ్ళడం. మనలిని యింట్లోంచి పొమ్మన్నాక ఏ మొహం పెట్టుకుని వాళ్ళగుమ్మం తొక్కుతాం.

కాంత: పిల్లని యిచ్చుకున్నవాళ్ళం మనకి తప్పుతుందా!

సత్య: మనం వెళ్ళి చెల్లాయికి ఏ సేవా చెయ్యలేము, వాళ్ళు మనలిని మళ్లా యింట్లోంచి గెంటేస్తే, చెల్లాయి బాధపడుతుంది. దాని జ్వరం ఎక్కువవుతుంది. మనం అక్కడికి వెళ్ళడం మంచి పని కాదు.

కాంత: అమ్మాయి టైఫాయిడు జ్వరంతో బాధపడుతూంటే నాకేమీ తోచటంలేదు. కడుపు దుఃఖంతో తరుక్కుపోతూంది. నెల్లాళ్ళు గడిచినా జ్వరం తగ్గలేదు. ఏమౌతుందో!

సత్య: ఆనాడు చెల్లెలిని మనవెంట తీసుకురమ్మంటె నువ్వు ఒప్పుకున్నావా అమ్మా! ఈ నాడు విచారిస్తే ప్రయోజనమేమిటి? ఒంట్లో

ఎముకలు లేకుండా పచ్చడిచేస్తూంటే ఏ శరీరం ఆరోగ్యంగా వుంటుంది? టైఫాయిడు వచ్చిందంటే రామా!

కాంత: ఇంతంత అఘాయిత్యాలు జరుగుతాయని నేనుమాత్రం కలగన్నానా బాబు! మేనరికం యిస్తే, స్వర్గం వస్తుందంటూ దాని పిల్లనిచ్చి వాడికి పెళ్ళిచేయించాను మీ నాన్న వద్దంటున్నా.

సత్య: అందుకే మనకు నరకం చూపిస్తున్నాడు మీ అల్లుడు.

కాంత: సిరిసంపదలగురించి ఆలోచించలేము. పునర్వసు నక్షత్రాన పుట్టిన పురుగుకైనా అన్నం దొరకకపోదనే మాటనమ్మి, మీ నాన్నను ఒప్పించి పెళ్లి చేయించాను, కోపిష్టివాడని తెలిసినా, గుణం మారుతుందని భ్రమించాను. పిల్లను బాదగొట్టి, దాని జీవితం యిలా భగ్నం చేస్తాడనుకోలేదు.

సత్య: అమ్మా విచారించి ఏం లాభం. నన్నడుగుతే చెల్లెలు చనిపోతేనే మంచిది. దుఃఖభారమై, నిత్యమూ చావుదెబ్బలు తింటూ, యమయాతనతోగూడిన సంకుచిత సంసార జీవితం కంటె, ఒకనాడె ప్రాణాలుపోతె మంచిది. నిత్యమూ చస్తూ బ్రతికేజీవికన్న చచ్చిన జీవి మేలు. ఆ నాటితో ఆ జీవికి కడగండ్లు అంతమౌతాయి.

కాంత: అంతంత మాటలు అనకు నాయనా! అమ్మాయి బ్రతికిబట్టగట్టాలని నా ప్రార్థన.

సత్య: అది బ్రతికిన తర్వాతకూడా ఆ కర్కోటకుడిచేతిలోనే బ్రతకాలిగా! ఇంక దానికి సుఖమెక్కడిది? మళ్ళి అతను బాధపడడం, ఆమెకు రోగం రావడం పరిపాటైపోతుంది.

కాంత: అయితే చెల్లెల్ని చూడడానికి రావా?

సత్య: (గద్గదికంగా ఏడుస్తూ) క్షమించు. అమ్మా! నేను రాలేను. పైపా
యిడు జ్వరం ఆమె జీవితానికి భరతవాక్యంపాడి, ఆమె కష్టాలు
కడతేర్చాలని నేను పైవాన్ని ప్రార్థిస్తున్నాను

కాంత: అల్లా అనకు సత్యం! ...... సరే నేనొక్కత్తెనే అమ్మాయిని చూసి
వస్తాను.

## 3వ రంగం

[సరళ ఆరోగ్యం బాగుపడింది, రెండు సంవత్సరాలు గడిచాయి.
బండి చప్పుడు.]

సర: (ఏడుస్తూ) అమ్మా!....అమ్మా!....వచ్చావా అమ్మా!

కాంత: ఏడవకమ్మా!....అన్నీ విన్నాను.

సర: ఎలాగమ్మా! యీ జీవితం భరించడం.

కాంత: బాధపడకు తల్లీ. కష్టాలు కలకాలంవుండవు....యీ రెండు నెలలు
ఒక్కర్తెవ్వ యిక్కడ ఎందుకున్నావు? మా దగ్గరికివస్తే మాతో
పాటే కలో గంజో తాగేదానవుగా!

సర: (గద్గదంగా) అమ్మా! మీరే వాటయ్యమీద ఆధారపడి. జీవితాలు
చినచినగండంగా గడుపుకుంటుంటే, నాభారంకూడా ఎందుకుమీకు!
...అయినా యిన్నాళ్ళదాకా ఆయన తిరిగివస్తారని ఆశించాను....
యింట్లోవున్న డబ్బుతో కొన్నాళ్లు తిని, కొన్నాళ్ళు తినక, ఎలాగో
కాలక్షేపం చేశాను.

కాంత: మీ యింటిప్రక్క ఆవారినాయు మా వూరువచ్చినప్పుడు యీ
సంగతి తెలిసింది. ఒక్క ఉత్తరంకూడా వ్రాయకపోయావా తల్లీ!

పద: మీకు తెలిస్తేమాత్రం ఏం చెయ్యగలరమ్మా! ఇదంతా నా పాపఫలం. ....అత్తయ్య చనిపోతూ, నన్ను పెట్టిన కష్టాలకు పశ్చాత్తాపపడింది రెండు నెలల పక్షవాతంలో. నే చేసిన చాకిరీకి సంతోషించి, నన్ను జాగ్రత్తగా చూడమని, అత్తయ్య ఆయనకు చెప్పింది రోజులు మారి సుఖంగా వుంటామనుకున్నాను...... ఒకనాడు సాయంత్రం. నన్ను తనతో బయటికి షికారు రమ్మన్నారు.... ఈ పల్లెటూర్లో. చేలగట్లపై కులుకుతూ షికారు చేస్తూంటే, నల్గురూ మాటేసి చూసి నవ్వుతారని సిగ్గుపడి, అది మంచిపని కాదన్నాను....అంతే.... ఆయనకు కోపంవచ్చింది. నన్ను బాన గొట్టాడు. మర్నాడు ప్రొద్దున్న యింట్లోంచి బయటకి వెళ్ళాడు......యిప్పటికి రెండు నెలలయింది. ఇంకా రాలేదు.

సత్య: అతని మనస్తత్వం ఎవరికీ అర్థంకాదు లేశమైనా లౌకికజ్ఞానంలేని మూర్ఖుడిలా వున్నాడు.

కాంత: మన యింటికి వదమ్మా! యిక్కడ ఒకర్తెవు వుండి ఏంచెయ్యగలవు?

పద: ఒక్కర్తెనే వుంటాను. చనిపోతే ఏనాడైనా, నా శవం ఆయన యిక్కడే చూడాలి.

సత్య: హూ! ఆయనకు తగ్గ పెళ్ళాం. ఆయన మూర్ఖుడు. ఈమెద మొండి. చచ్చి ఎవరిని సాధిస్తావు! కష్టాలపరంపరలో ఆత్మహత్య చేసుకునే దానికన్న, కష్టాల నెదుర్కొని జీవితం సక్రమంగా దిద్దుకోడం మంచిది.

కాంత: సరే నీ యిష్టమే కానియ్యి..... కొంతకాలం ఓపికపడితే అతనే బాగుపడతాడు.

సత్య: నాన్నకు నీకు అనురాగమైన దాంపత్య జీవితం గడిచింది కనుక, నువ్వు ఎన్ని నీతులైనా చెప్పినావు కానీ,— హా! అల్లుడు బాగుపడతాడని నీ ఆశ. వాడు జన్మలో బాగుపడడని నేను ఢంకా బజాయించి చెబుతున్నాను.—నువ్వు చేయించిన ఒక్క పెళ్లి యీ విధంగా పరిణమించింది.

కాంత: సత్యం! ఎందుకు నన్ను అన్నిమాటలంటావు. చేసిన పెండ్లి యిప్పుడు చెడగొట్టలేము. ఈ పరిస్థితులు చూస్తూంటే నాకు బాధ గానే వుంది. మీ నాన్న యీ విషయం గురించే మనోవిచారంలో కృశించారు ఆయన చివరి రోజుల్లో.

సత్య: (గద్గదంగా) ఉద్రేకం ఆగక అన్నానమ్మా యీ మాటలు క్షమించు.

కాంత: అమ్మాయి! నువ్వు యిక్కడే వుండదలచుకుంటే నీ యిష్టం. కాని యీ డబ్బు తీసుకుని వాడుకో. అల్లుడు తిరిగి వచ్చాక తిరిగి ఒక వుత్తరం వ్రాయి

---

కాంతమ్మగారికి నమస్కారములు:—

మీ అమ్మాయి మొన్న నూతిలోపడి ఆత్మహత్య చేసుకోబోయింది, మేము పైకి తీసి రక్షించాము. ప్రస్తుతం ఆమె మా యింట్లో వున్నది. మీ అల్లుడు రామశర్మ మూడు నెలలు గడిచినా యింకా రాలేదు. ఇక్కడి పరిస్థితులు యివి. మీరు మీ అమ్మాయిని తీసుకు వెళ్ళి సంరక్షించుకుంటే బాగుంటుంది,

ఇట్లు
ఆచారి

కాంత: సత్యం! చూశావా యీ వుత్తరం.

సత్య: ఆఁ (రౌద్రంగా) అన్నీ చూస్తున్నాను. చూసి చూసి కుమిలి కుమిలి చస్తున్నాను.

---

[ఒక సంవత్సరం గడిచింది. గుడిగంటలు. పూరి జగన్నాథ స్వామి ఆలయం]

రామ: (పిచ్చిగా) తండ్రీ! జగన్నాథస్వామీ! ఒక ఏడాది నీ సేవచేశాను. గెడ్డాలు, మీసాలు పెంచి, కాషాయవస్త్రాలుగట్టి సన్యాసినై పోయాను. నీ దివ్యప్రసాదం భక్షించాను...... ఇదంతా ఎందుకు మనశ్శాంతి కోసం.... ఇంక వెళ్ళి సంసారయాత్ర చేస్తాను.... ....నా కెందుకు కోపం వస్తుందో నాకే తెలియదు. కోపం వచ్చినప్పుడు నా భార్యను చావబాదినా. ఆమె మీద నాకు అపారమైనప్రేమ. ... దాన్ని ఒక రైను విడిచి వచ్చాను. అది నా తప్పే! కాని దానికేం ఎంతోమంది వున్నారు సంరక్షించడానికి. నాకే ఎవరూ లేరు. నీవే నాకుదిక్కు జగన్నాథస్వామీ! సెలవు. నమస్తే!

(రైలుకూత)

రామ: అత్తయ్యా!.... అత్తయా! నేను వచ్చాను.

కాంత: (బాధగా) దేశయాత్ర పూర్తి అయ్యిందయా.

రామ: క్షమించు. అత్తయ్యా! ఆనాడు ఏదో కోపం వచ్చి వెళ్ళిపోయాను. మళ్ళీ వచ్చానుగా! సరళ అంటే నాకు అపారమైన ప్రేమ. నీకు తెలియనిదేముంది. నేను మళ్ళా కాపురంచేసుకు బాగుపడతా.

కాంత: సరే నాయనా! నీ యిష్టం. మీ యిద్దరు సుఖంగా వుండటమే నాకు కావలసినది.

సత్య: అల్లుడు దేశయాత్రలుచేసి వచ్చాడు. అత్తగారు ఉబ్బిపోయింది. ఇటువంటివాడు తిన్నగా కాపురం చేస్తాడని జ్ఞానమున్నవాడెవడూ అనుకోడు.

రామ: బావా: నా మీద నీ కెందుకంతకోపం.

సత్య: ఇది కోపంగాదు. నిజం మాట్లాడుతున్నాను. నువ్వు యీ జన్మలో బాగుపడవు. నువ్వు నీ దారిని వెళ్ళు. నా చెల్లెలిని పంపించను.

రామ: చూశావా అత్తయ్యా.... నేను సరళతో మాట్లాడుతాను.....సరళా!

సర: ఏమండీ!

రామ: నిన్ను పొరపాటున కోపంవచ్చి కొట్టేశాను...మనం మళ్ళీ కాపురం చేసుకుందాం.

సత్య: పొరపాటున కోపం వచ్చిందట! పిచ్చికోపం నీ అలవాటని చెప్పుకోరాదూ!

రామ: ఏమంటావు సరళా! నీ పాదాలు పట్టుకుంటాను.

సర: తప్పు. (బాధగా) అంత మాట అనకండీ. పదండి మనవూరు వెడదాం.

సత్య: (కోపంగా) చెల్లాయి!

సర: నువ్వు ఊరుకో అన్నయ్యా యీ సారికి.

శాంత: సత్యం! ఆగ్రహం తగ్గించుకో. ఆడపిల్ల నిచ్చుకున్నవాళ్ళం చాలా మర్యాదగా సంచరించాలి.

[మూడు సంవత్సరాల తర్వాత]

రామ: నాకెందుకు కోపం వస్తుందో నాకే తెలియదు. ఒక్కొక్కసారి ఆ కోపంలో నానా మాటలూ అంటాను.... సరళను వెయ్యి విరిగేటట్టు

కొట్టాను. భార్యాభర్తలమయ్యాక కొట్టుకుంటాం. తిట్టుకుంటాం. మధ్యన మా అత్తగారి వాళ్ళకెందుకటా నా గొడవలు......మా పిన మామ మరీ రోషిష్టి....నన్ను తన యింట్లోంచి పొమ్మన్నాడు. నా పెళ్ళాన్ని వుండమన్నాడు... అయిపోయిందేదో అయిపోయింది. తిరుపతి వెంకటేశ్వరస్వామీ! క్రిందటి రెండేండ్లు నీ సేవచేశాను. నా మనశ్శాంతికోసం....నన్ను రక్షించు....నా కాపురంనిలబెట్టు.... యీ మద్రాసు పట్టణంలో ఎక్కడని వెదకను?

---

రామ: బావా! నమస్కారం. తిరిగి తిరిగి యిన్నాళ్ళకు నిన్ను చూడగలిగాను.

సత్య: (రౌద్రంగా) ఎందుకు వచ్చావు యిక్కడికి? నిన్ను ఎవరు రమ్మన్నారు.

రామ: బావా! నన్ను ఒకరు రమ్మనేదేమిటి? సరళ యిక్కడ వుంటేకమ్మా, తీసుకు వెడదామని వచ్చా!

సత్య: రెండు సంవత్సరాలయినాక నీ భార్య జ్ఞప్తికి వచ్చింది. మా సంసారం ఏనాడో నాశనమయింది. మేము బ్రతికిలేము. చచ్చివున్నాం. నీ దారిన నీవు వెళ్ళు.

రామ: అలా అంటావేమిట బావా!

సత్య: అవును. నా కుటుంబ ప్రతిష్ట నాశనం చేశావు. నీ మొహం నేను చూడదలుచుకోలేదు. ఈ యింట్లో నీకు స్థానంలేదు.

రామ: నా బాధలు నీకేం తెలుస్తాయి. హైద్రాబాదు, కలకత్తా, మధుర,

నువ్వొకొత్తె దెబ్బలుచూడలేక, పిల్ల చస్తుందని, నిన్ను బయటికి గెంటేసేవారు. భార్యను పెట్టిన బాధలు చాలక, వాన్నివిడిచి నాగ్గ సాధ్లు దేశయాత్రలకు లేచిపోయావు. భార్యతో కాపురం చెయ్యనని తుపానులో శిథిలంలో మమ్మల్ని బయటికి గెంటేశావు. నాన్నకు వాచపని యిచ్చిన కొద్దిడబ్బు సమయానికి యివ్వలేదని. భార్యతో కాపురం చెయ్యనని జండాలు తెంపేశావు. నీ కష్టాలలో సహాయం చేసిన బాబాయిని అనరానిమాటలు అని మతిచెడగొట్టావు. నీభార్య శీలం శంకించావు. మా కుటుంబనైతిక ప్రతిష్ఠ భగ్నంచేసి, సంఘంలో ప్రచారం చేశావు. నెత్తిమీద బాధ్యతలతో, చితికిన కుటుంబ ప్రతిష్ఠతో కృంగి కృశిస్తున్నాం. హుః ఇప్పుడు బావా అని తియ్యగా పలకరించడానికి వచ్చావు:

రామ: బావా! జరిగిపోయిన సంగతులు త్రవ్వుకోడమెందుకు? ఇకముందు నన్ను చూడు. చాలా బుద్ధిగావుంటా. ఉద్యోగం సంపాదించుకుని బాగు పడతాను.

సత్య: నైతికప్రవర్తన కుటుంబ ప్రతిష్ఠకు పునాది. అది విచ్ఛిన్నమైతే, కుటుంబం నాశనమయినట్లే. నీ విచిత్ర క్రూరప్రవర్తన అంతా భరించాము. బాంధవ్యమూపంలో తలదాచుకుని, మా కొంపకు చిచ్చు ముట్టించావు. నీ తండ్రి నిన్ను యింట్లోంచి గెంటేశాడు. నీ బాబయ్య గెంటేశాడు. నీ మేనమామలు గెంటేశారు. నీవు మా యింట్లో సృష్టించిన నేటి పరిస్థితులే, నిన్ను యిప్పుడు గెంటేస్తున్నాయి...నీకు మా గృహంలో స్థానంలేదని నిర్ణయించాను. మా బాంధవ్యానికి నీ వనర్హుడవు. నీ దారి నీవు చూసుకోవచ్చు యీ క్షణం నుంచి.

రామ: రావా! నా పరిస్థితి చూడు! ఏ గతి వేషంలో వున్నాను. మూడు రోజులనుంచి భోజనంలేదు.... నువ్వు మాత్రం కష్టాలుపడలేదూ? ...నేను ఈ నాడు బికారిలా వున్నానని పొమ్మంటున్నావా!

సత్య: ఆ మాటలు అంటావని నాకు తెలుసు. నువ్వు ఆర్థిక చిక్కుల్లో వుంటే, నాకూ మానవ హృదయం వుంది. నీకు కావలసిన ధన సహాయం చేస్తాను. ఉద్యోగం సంపాదించుకుని బాగుపడు. కాని మన సంబంధబాంధవ్యాలు యీ నాటితో సరి. మా యింట్లో ఆతిథ్యానికి నీకు అర్హతలేదు. నీ దారిని నీవు వెళ్లు.

రామ: అయినా నువ్వెవరవు! ...నా భార్యతో మాట్లాడతాను...సరళా!

సర: (ఏడుస్తూ) ఏమండి!

రామ: మనం తిన్నగా కాపురం చేసుకుందాం మళ్ళీ! నా మాట వినవూ!

సర: మనంచేసిన పదకొండు సంవత్సరాల కాపురం చాలు. మా కుటుంబానికి తలవంపులు తెచ్చింది. నిత్యమూ, గృహకలహాలతో, చావు దెబ్బలతో. సంఘంలో నవ్వులపాలయ్యే బదులు, విడిగా, మనశ్శాంతితో జీవితాలు ఒంటరిగా వెళ్ళబుచ్చుకోడం మంచిది. నా జీవనోపాధి నే చూసుకుని, యీ జీవితశేషం ఒంటరిగా బ్రతుకుదామని నిశ్చయించాను.

రామ: (కోపంగా) ఏం! ఎదురు తిరిగి సమాధానమిస్తున్నావు!

సర: అవును. ఎదురుతిరిగి సమాధానమివ్వడం మీ ప్రవర్తనే నేర్పింది. చావుదెబ్బలుపడి, మీ పాదాలు పట్టుకుని, కాపురం నిలబెట్టుకుందామన్న రోజులుకూడా వున్నాయి. జ్ఞాపకం పెట్టుకోండి .. నన్ను ఒంటరిగా బ్రతుకనివ్వండి యింక.

రామ: అయితే ఉద్యోగంచేసి బ్రతుకుతావన్నమాట!

సర: అవును. చెయ్యాలి. ఉద్యోగమోదాహోసం కాదు. నా జీవనోపాధికీ నా పోషణభారం యితరులపై తగ్గించడానికి.

రామ: (కోపంగా) పోనీ ఉద్యోగంచేసి నన్నే పోషించు యికముందు!

సత్య: అవి మగవాడు అనవలసిన మాటలు కావు!

రామ: (జాలిగా) నేను నీ కోసమని ఎన్నో నక్సాటి చీరలు కొన్నాను. ఏది కావలిస్తే అది యిచ్చాను కడుపునిండా భోజనం పెట్టాను...... ఆ రోజులు మర్చిపోయావా!

సత్య: భార్యలకు భోజనం పెట్టడం భర్తలుచేసే ఘనకార్యం!!

సర: (మౌనం)

రామ: మాట్లాడవా! సరళా — అత్తయ్యేమేది!

సత్య: నీవల్ల కలిగిన కుటుంబకష్టాలు తీసుకోడానికి పూరంగా పెళ్ళింది.

రామ: (ఏడుస్తూ) స....ర....ళా! సరళా!

సర: (గద్గదంగా) చాలా ఆలోచించి యీ నిర్ణయానికి వచ్చాను. మనిద్దరం ఒంటరిగా విడిగా బ్రతికితే అందరికీ శ్రేయస్సు

రామ: అంతేనా!

సత్య: అంతే. నీ భార్యమాటలు విన్నావు. యింక నీ దారిని వెళ్లు.

రామ: అయితే విడాకులు యిప్పించదల్చుకున్నావా! దావా!

సత్య: నీ బుద్ధి అంతవరకే ప్రసరించడం శోచనీయం. విడాకులు పునర్వివాహ హక్కు సూచిస్తుంది. నేను అది నిరసిస్తాను. స్త్రీ పురుషుల విషయంలో నిత్యపునర్వివాహాలు. శీలపతనానికి. దరిద్రసంతానానికి

నీచ సంఘానికి దారి తీస్తాయి. జీవితంలో వివాహం ఒకేసారి జరగాలి. జరిగిన వివాహం దుఃఖకరంగా వుంటే, విడిపోయి శీలంనిలుపుకుంటూ, ఒంటరి జీవితం గడపడం మేలు. అదే నీ భార్య నిశ్చయించింది.

రామ: బావా! ఏదో కోపంలో అనేక మాటలన్నాను ఆ నాడు. ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నాను. ఇకముందు సరిగా ప్రవర్తిస్తాను.

సత్య: ఇటువంటి పశ్చాత్తాపాలు నీ కలవాటైన పాటలు. నీ పశ్చాత్తాపం నిజమైతే, అది చాల ఆలస్యమయిందంటున్నాను.....కాలుజారితే తీసుకోవచ్చు; నోరుజారితే తీసుకోలేము. అనరానిమాటలు అని చెయ్యరాని ప్రచారంచేశావు. మా కుటుంబశీలం గురించి...చేతులుకాలేక ఆకులు పట్టుకోడం తెలివిలేని పని.... ఇంక వెళ్ళు.

రామ: అయితే యీ మహాపట్నంలో ఎక్కడికి వెళ్ళమంటావు బావా! కొన్నాళ్లు ఆతిథ్యమియ్యి.

సత్య: మా యింట్లో ఆతిథ్యానికి నీ వనర్హుడవు. పరులకుచేసినట్లు, నీకు వుచిత ధనసహాయం చేస్తాను కావలిస్తే. అవసరమైతే, యీ యింట్లోకి నీ భార్యతెచ్చిన ప్రతి వస్తువుకూడా తీసుకుపోవచ్చు.

రామ: నా భార్యమీద నాకు అపారమైనప్రేమ......నా భార్య నాతో రాకపోతే, నాకేమీ అక్కరలేదు. ఇలా కట్టుగుడ్డలతో పోతాను బయటికి.

సత్య: నేను అలా పొమ్మనటంలేదు. నీవు అపార్థం చేసుకుంటున్నావు.

రామ: మంచిది, సెలవు బావా!

[ బయట ]

ఒకరు: ఎవరండీ! అక్కడ నుంచున్నారు.

రామ: నేను మీ యింటి ప్రక్కవున్న సత్యంగారి బావమరదిని. (ఏడుస్తూ) నన్ను అతను కట్టుగుడ్డలతో బయటికి గెంటేశాడు.

ఒకరు: అల్లాగటోయి! అతనటువంటివాడా!....నాకు తెలియదే!.... పోనీ కొన్నాళ్ళు మా యింట్లో వుండు.

రామ: అల్లాగేలెండి. పరాయివాళ్ళకైనా జాలి కలుగుతుంది. కాని బంధువులకు కలుగదు,

ఒకరు: పాపం!

రామ: (స్వ) కొన్నాళ్ళు వీళ్ళ యింట్లో తిష్టవేస్తేసరి. పక్కనున్న భార్య ఎక్కడికి పోతుంది....ఎప్పుడో ఒకప్పుడు లేవదీసుకుపోవచ్చు.

రెం. స్త్రీ: మొగుడు కాపురానికి రమ్మంటే రానంటూంది ట వాళ్ళ నరళ!

మూ. స్త్రీ: పరాయివాళ్ళ సంసారం గొడవలు మనకెందుకే? ఎవరిది తప్పో మనకేం తెలుసు!

నా. స్త్రీ: పాపం! ఆ అమ్మాయి ఎంతెంత కష్టాలుపడిందో! కాపురం చెయ్యలేనంది చివరకు. (దుఃఖంతో) బ్రతికివుంటే బలుసాకు తినవచ్చు. నా అల్లుడు పెట్టిన కష్టాలకు, నా కూతురు రైలుకింద పడి ఆత్మహత్య చేసుకుంది.

[యింటిలో]

సత్య: మానవజీవితంలో గృహచ్ఛిద్రాలు మామూలు. కాని లోకం నాలిక యీ గృహచ్ఛిద్రాల రుచిమరిగి, కాకిలా అరుస్తుంది. సత్యం మరిచి అసత్యం చూపి గేలిచేస్తుంది... యీ గృహసమస్యలు విస్మరించి, జీవనసమస్యలకు ప్రాధాన్యమిచ్చి పురోగమిస్తేనే, నిత్యనూతన జీవిత చైతన్యం.

పాత్రలు :

1. రామావధాని: మర్యాదస్థుడైన కుటుంబికుడు
2. సీతాయమ్మ: రామావధాని భార్య వెటకారపు మనిషి
3. అనంతబుద్ధి: }
4. నిరంజనదాసు: } చాలా దూరపు బంధువులు
5. నాయిబాబు: రామావధానికి తృప్తిపడ మిత్రుడు

## 1వ రంగం

[రామావధానిగారి యింట్లో నిరంజనదాసు భాగవత కాలక్షేపం చేస్తూ]

నిరం: "చుట్టాలు దొంగలు, సుతులు ఋణస్థులు, కాంతలు సంసారకారణములు". ఇదిగో రామావధానులుగారూ! పోతన రచన చాల మృదుమధురంగా వుంటుందండి.

రామా: పోతన కవిత్వం నిరంజనదాసుగారి పఠనలో ద్రాక్షాపాకంలా ఉంటుందంటె సరిపోతుందిగా!

సీతా: "కాంతలు సంసార కారణములు" అని వైరాగ్యజ్ఞానం చూపిన మనిషి. పోనీ, తను పెళ్ళిచేసుకోడం మానేడాండి పోతన?

[టకటకమంటూ జట్కాచక్రం చప్పుడు]

నిరం: గృహస్థాశ్రమం జీవితధర్మం కనుక పెళ్ళాడినవాడే కాని. పోతన నిజంగా పెళ్ళికావాలని కోరేడనా మీ వుద్దేశ్యం! అబ్బ!

[ జట్కా ఆగిన చప్పుడు, పెట్టెలశబ్దం ]

రామా: ఇదిగో! సీతా! మన యింటిముందు జట్కా ఆగినట్లుంది చూడు!

సీతా: (వెటకారంగా) మరే! ఇంకెవరై వుంటారు. ఎవరో చుట్టాలేమో!

[ అనంతబుద్ధి ప్రవేశం ]

అనం: రామావధాన్లుగారూ! నమస్కారం. అంతా క్షేమంగా వున్నారా !

రామా: ఎవరది!

అనం: నేను! నేనండి! జ్ఞాపకం రావండి!

రామా: ఏమోనాయనా! ఎక్కడైనా చూసేవేమో కాని, అట్టేజ్ఞాపకంలేదు.

అనం: నాపేరు అనంతబుద్ధి! హిహిహి.......మీ మూడో అల్లుడు లేడూ! వెంకటశాస్త్రి!... వాడి అమ్మ అక్కగారి మనుమరాలిని మా తమ్ముడికిచ్చారు....అప్పుడప్పుడు మీ వెంకటశాస్త్రి నేనూ బాగా కలిసి తిరుగుతూండేవాళ్ళం...పాపం! మీకు పెద్దతనంచేత జ్ఞాపకం తగ్గి వుండవచ్చు.....వెంకటశాస్త్రి పెళ్ళికికూడా .... అన్నట్టు రాలేదు. వద్దామనుకున్నాను. ఎప్పటి కప్పుడు మీ యింటికి వద్దామనుకోవడమే. తీరుబడి వుంది కనుకనా! జీవితమంతా యీ వుద్యోగంతో సరిపడేటట్టు వుంచండి!

సీతా: (హేళనగా) అయితే! నాయనా! మా అల్లుడి దొడ్డమ్మగారి మనుమరాలు చిట్టిని మీ తమ్ముడి కిచ్చారన్నమాట!

అనం: మరేనండి! రెండు నెలల క్రితం వెంకటశాస్త్రి మా యింటికి వచ్చాడు. నాకు యిక్కడి భండారుపురం బదిలీ అవుతుందని చెప్పినపుడు "ఓసారి మా మామగారి యింటికి వెళ్ళి చూసి రారా! " అన్నాడు. భండారుపురం వచ్చి ఏడైదైందనుకోండి ! కాని తీరుబడో! ఎప్పటి కప్పుడే వద్దామనుకోడం! ఏదో పని అడ్డురావడం! యిన్నాళ్ళకి రాగలిగాను.

రామా: నేను నిన్ను చూడడం యిదే మొదటిసారి. అయితే మా యిల్లు ఎల్లా కనుక్కోగలిగావోయి అనంతబుద్ధీ!

అనం: ఏముందండి. నోట్లో నాలికవుంటే ఏదైనా చెయ్యొచ్చు! ఫలానా చోట అని మా శాస్త్రి చెప్పాడు. ఇక్కడికి వచ్చాక నల్గురిని కను క్కొన్నాను. హిహీహీ .... నేను మిమ్మల్ని చూడలేను కానండి. మీ ఫోటో చూశాను. అందుచేత మిమ్మల్ని యిట్టే ఆనవాలు పట్టే శాను. హిహిహి.

సీతా: (హేళనగా) మమ్మల్ని చూడకపోయినా, ఏదో ఆ బంధు అభిమానం పురస్కరించుకు వచ్చావు! చాలా సంతోషం నాయనా!

నిరం: బంధువుల అభిమానం అంటే అల్లాగుండాలి.

సీతా: (వెటకారంగా) ఆ: ఆ: అల్లాగే వుండాలి.

రామా: (అనంతబుద్ధితో) ఈయన నిరంజనదాసుగారని .చాల భక్తులు.... హరిదాసులు....మనకి బంధువులు. యీ రెండు నెలలనుంచి హరి కథలతో మనవూరు పవిత్రం చేస్తున్నారు.

అనం: నమస్కారమండి.

నిరం: నిరంజనార్పణమస్తు.

రామా: అయితే అనంతబుద్ధి! భండారుపురంలో ఏం చేస్తున్నట్టు నువ్వు.

అనం: ఏముందండి. ఈ మధ్య ఆహారసేకరణ డిపార్టుమెంటు పెట్టారు కదూ! అందులో పని. నెల్లాళ్ళా బయట అడ్డమైన పల్లెటూళ్ళు తిర గడంతో సరిపోతూంవండి. నానా తిప్పలుపడాలి.

సీతా: ఏ తిప్పలు పడకపోతే అప్పనంగా డబ్బు ఇస్తారటయ్యా ఎవరైనా?

రామా: లేవోయి! లేవోయి! అనంతబుద్ధి! కాస్తభోంచేసి విశ్రమించువుష్ట గాని: ఒరే నానిబాబు! కాళ్ల కడుక్కొందుకు నీళ్ల తీసుకురా యీయనికి,

[ నానిబాబు ప్రవేశం ]

నాని: (నీళ్లు యిస్తూ) ఎవరికే అమ్మా నీళ్లు!

సీతా: ఆయనకేరా: అనంతబుద్ధిగారికి.

అనం: ఇతను మీ అబ్బాయాండీ! ఏం చదువు తున్నావోయి పంతులు?

నాని: మూడవఫారము చదువుతున్నాను.

రామా: వీడు మా మూడో కుఱ్ఱాడు.

అనం: అయితే నువ్వు నాకేమవుతావోయి పంతులు! పిన్నాన్నవవుతావన్న మాట! ఏమండోయి పిన్నాన్నగారూ!

సీత: వరుసలు, వావిలు తరువాత చూసుకోవచ్చు. భోజనానికిలేస్తే బాగుంటుందేమో!

రామా: మరే! భోజనానికి లేవోయి అనంతబుద్ధి.

అనం: చిత్తం!—దాసుగారు; ఏదో చదువుతున్నట్లున్నారు——నా రాక ఏమన్నా అభ్యంతరం —

సీతా: అబ్బెబ్బే! ఏమీ అభ్యంతరం కలుగలేదు. ఆయన నిత్యం తీరుబడి మనిషి.

రామా: మరే! ఎప్పుడు కావలిస్తే అప్పుడే చదివించుకోవచ్చు భాగవతం, ముందు భోజనానికి లెండి,

## 2వ రంగం

[ రామావధాని. సీతాయమ్మ యింట్లో మాట్లాడుకుంటూ ]

సీతా: ఏమండీ! ఇదేమన్నా సత్రమనుకున్నారా! సంసారం అనుకున్నారా! రెండు నెలలనుంచీ గడి తింటున్నాడు ఆ దాసు. ఉద్యోగం సని యీ పూట్కో యింటా రెండు నెలలైనా పడుకుంటాడు యీ అనంతబుద్ధి: యిల్లా నెలల తరబడి అధ్వాన్నపాళ్యాన్ని ఉంటూంటే సంసారాలు మట్టికొట్టుక పోతుంటాయి!

రామా: ఇంటికి బంధువులొస్తే ఆమాత్రం మర్యాద చెయ్యకపోతే బాగుంటుందా!

సీతా: బంధువుల మర్యాదకుకూడా హద్దూపద్దూ లేదూ. దగ్గర బంధువులైతే అనుకోవచ్చు. పోనీ: లేనివాళ్ళైతే అనుకోవచ్చు. అక్కమ్మ బావమ్మ నాయనమ్మ మనమడి కొడుకునంటూ యీ అనంతబుద్ధి ఎవరు? ఆ దాసు చూడండి! రెండు నెలలనుంచి హరికథల్లో సంపాదించింది బొడ్డున మూటకట్టేస్తున్నాడు. భోజన కాలక్షేపం మనింట్లోను, భోషాణంలో ధనం దాపరికం. మనలాంటి తెలివితక్కువ వాళ్ళెవరూ వుండరు.

రామా: ఊరుకో! వాళ్ళువస్తే బాగుండదు. వింటే ఏమనుకుంటారు?

సీతా: వింటే నాకేమండీ! మంచీచెడ్డా లేకుండా, నిర్మొహమాటంగా తిండి కోసం తిష్టవేస్తే, మనకుమాత్రం పొమ్మనడంలో మొహమాటా లెందుకు?

రామా: ఇక్కడ ఉంటే నీ పోరు తగ్గేటట్టు కనిపించడంలేదు. నేను బయటకు పోనా ఏమిటి?

సీతా: ఏమన్నా అంటే బయటికి పోతాననడం బాగా తెలుసు. వెడితే వెళ్ళండి! వాళ్ళు రాగానే బయటికి సాగనంపుతా!

రామా: ఆసీ! నీ యిల్లు బంగారంగాను! అంతపని మాత్రం చెయ్యకు. సంసమర్యాద నిలబడాలా!......నేను బయటికి పోతున్నా తలుపే సుకో!

(తలుపు మూసిన చప్పుడు)

సీతా: వారిమ్మ్రటపోయేవాడు ప్రతీవాడు బంధువే! బంధువులట! బంధువులు! రానీ! మూటాముళ్ళు కట్టేటట్టుచేస్తాను.

(తలుపు తట్టిన చప్పుడు)

విరం: సీతాయమ్మగారూ!

సీతా: వచ్చాడూ యీ దొంగదాసు! రానీ!.... (ఏడుస్తూ) హాంహాంహా. వండి! (తలుపుతీసి) దాసుగారూ! అయ్యో! అయ్యో!.........ఎంత అవస్థ తెచ్చి నా నెత్తిన పడేశావురా నాయనా!

విరం: అదేమండి పాపం! అల్లా విచారిస్తున్నారు.

సీతా: (ఏడుస్తూ) ఏముంది నాయనా! ఇంత కష్టం వస్తుందనుకోలేదు. పిడుగువచ్చి మీద పడిపోయింది.

విరం: నిజమేలెండి. పెద్దపెద్దవాళ్ళమీదే యీ పిడుగులు పడుతూంటాయి లెండి. ఇంతకీ ఆ పిడుగు ఏమిటో చెప్పారు కారు!

సీతా: ఇంకేముందండి!...మా మామగారు లేరూ!

విరం: ఉన్నారు. కొంపదీసి! ఆయనకాని....

సీతా: ఆయన కాదండి! ఆయన పినతండ్రి కొడుకు పోయాడు.

నిరం: అరెరె! అయితే పారిపోయాడా! చచ్చిపోయాడా!

సీతా: (ఏడుస్తూ) పారిపోతే యింతగా ఏడ్వడ మెందుకండీ ? చచ్చిపోయాడు కనుకనే దుఃఖం పొంగి పొరలి వస్తూంది.

నిరం: పాపం! ఎప్పుడు పోయాడు.

సీతా: ఈ వేళ ప్రొద్దున్నటండీ! ఇప్పుడే పెళ్ళిగ్రాం వస్తే ఆయన ఉరకలు వేసుకుంటూ పరుగెత్తారు. నేనంటే వాడికి ఎంతో అభిమానం.

నిరం: అయ్యయ్యో! ఎంత కష్టం. ఎంత కష్టం. కష్టాలు మానవులకే వస్తాయి. అందులో, ఓపిగ్గా అనుభవించేవాళ్ళకి మరి వస్తాయి.

[ అనంతబుద్ధి ప్రవేశం ]

అనం: ఆదేమండీ! సీతాయమ్మ మామ్మగారూ! అల్లా విచారిస్తున్నారు.

నిరం: రావోయి. అనంతబుద్ధి! యీావిడకు తగని కష్టంవచ్చి మీదపడింది. యీావిడ మామగారి పినతండ్రి కొడుకు పాపం! పరమపదించాడు.

అనం: అయ్యయ్యో! మీరు యింకా అలాచూస్తారేం? కాస్త ఆ గీతాసారం ఆవిడకు బోధించి ధైర్యం చెప్పండి. ఇటువంటి కష్టాలలోనే మీ పురాణాల ప్రయోజనం చూపించాలి.

నిరం: అది నిజమే కానోయి! ఇటువంటి కష్టాలు వచ్చినప్పుడు నా గీత బాగా పలకదు. ఈవిడని చూస్తూంటే నాకే ఎంతో దుఃఖంవస్తోంది.

సీతా: (విచారంగా) నాకు మహాశోకంమకు మరీ దుఃఖం వస్తోంది. మీకు యింత కష్టం కలిగించవలసి వస్తుందని కలలోకూడా అనుకోలేదు.

నిరం: (ఆశ్చర్యంగా) మాకు కష్టమా! (విచారంగా) మాకు కూడా ఏం కష్టం వచ్చిందండీ.

**సీతా:** ఇంకేముంది! మాకా 12 రోజులు మైల. నేను యింట్లో వండడానిక్కి వీల్లేదు. పైగా నేను మా మామగారి పినతండ్రిగారి ఊరు వెళ్ళాలి. పాపం! మీకు భోజనానికి చాలా యిబ్బంది కలుగుతుంది. మళ్ళీ తిరిగి ఎప్పుడొస్తానో నాకే తెలియదు.

**వీరం:** ఇది అంత పెద్దకష్టం కాదనుకోండి. మీరు కాస్త సెలవిస్తే, నేను యింట్లో వంట అంతా చేస్తాను. నలభీమపాకాల్లో ఆరితేరిన మనుషణ్ణండి నేను.

**ఆనం:** కావాలంటే నేనుకూడా ఒక చెయ్యి అందిస్తా దాసుగారిక్కి.

**సీతా:** నాకేమీ అభ్యంతరం లేదు గాని, మా వాళ్లు ఒప్పుకోరు. మైల యింట్లో వంటలేమిటి అని చెప్పిపోస్తారు బాబు బంధువులంతా. మీకేం తెల్సు మా కష్టాలు.

**ఆనం:** మరేనండి! కష్టాలక్కూడ కష్టాలు. అన్నీ ఒక్కసారిగానే వస్తాయి.

**సీతా:** మీరు వెళ్లిపోవలసివస్తున్నందుకు నాకు ఎంతో విచారంగా వుందంటే నమ్మండి. ఇన్నాళ్లూ తలలో నాలికలా ఎంతో కలిసి మెలిసి స్నేహంగా వుంటున్నారు.

**ఆనం:** దాసుగారూ! మీరు పోనీ యీ పన్నెండు రోజులు నాశ్రమంలో మరొక భక్తులింట బసచేయండి. నేను సీతమ్మమామ్మగార్ని వాళ్ళ బంధువులింట్లో దిగబెట్టి వస్తా.

**సీతా:** ఎందుకు నాయనా! నీకంత శ్రమ. ఒకళ్లని కష్టపెట్టడం నా కిష్టం లేదు. పైగా, నేను అక్కడికి వెళ్లానంటే, అదే పనిగా వుండమని తెగ బలవంతం చేస్తారు. తిరిగి ఎప్పుడు వస్తానో నాకే తెలియదు.

**దాసు:** ఉంటే సీతాయమ్మగారింట్లో వుండాలి. తింటే అక్కడే తినాలి.

యింకొకరి యింటికి రమ్మంటే మాత్రం వెడతామనుకున్నావా పోయి యీ నిరంజనవాసు!

అనం: సీతమ్మ మామ్మగార్కి యీ కష్టకాలంలో ఒక్కర్కి సేపసేపటిటమని వస్తున్నందుకు నాకు బాలా బాధగావుంది.

విరం: నాకు మరి బాధగావుంది. ఏం చేస్తాం? ధైర్యం మనుష్యలక్షణ. అని చెప్పాడు గీతలో.

అనం: మరయితే. ఏం చేస్తాం: నాకు యింకా పని కాలేదు యీ వూళ్ళో యింకా. ఊఁ.

విరం: ఆ రామావధాన్లుగారైనా లేరు. సరిహో అడగటానికి. పోనీ యీ ప్రక్కనేవున్న భాగోతులపల్లి వెళ్ళి కొన్నాళ్ళు హరికథాకాలక్షేపం చేసి, సీతమ్మగారు వచ్చాక మళ్ళీ రావచ్చు యిక్కడకు.

అనం: పదండి. నేనుకూడా అక్కడ ఆహారసేకరణ విషయం ఎల్లా వున్నదీ తనిఖీచేసి వస్తాను.

విరం: సీతాయమ్మగారూ! మరి సెలవా! వస్తాను.

అనం: సీతమ్మ మామ్మగారు! సెలవు. వెంకటశాస్త్రి వస్తే నేను వచ్చేనని చెప్పండి.

సీతా: మంచిది, నాయనా! పాపం! మాకు వచ్చిన యీ కష్టంవల్ల మీకు ఎన్ని చిక్కులు కలగుతున్నాయి.... అప్పుడప్పుడు తప్పకుండా వస్తూండండి.

అ.వి: అల్లాగేలెండి. (నిష్క్రమణ)

సీతా: అమ్మయ్యా, పోయారా. శని విరగడైంది. ఇదేమన్నా ధర్మసత్ర మనుకున్నారా పడి మింగడానికి.

(తలుపు కొట్టిన చప్పుడు)

రామా: సీతా! సీతా!

సీతా: ఆఁ. ఆఁ. వస్తున్నాను. (తలుపుతీసిన చప్పుడు)

రామా: వాళ్లు యింకా రాలేదా భోజనానికి.

సీతా: రావడం అయింది. సాగనంపడం అయింది.

రామా: అన్నంతపని చేశావు, నీ తెలివితేటలు మండిపోనూ. ఇదేం పనే. ఎల్లా పంపించేవు?

సీతా: మామగారి పినతండ్రి కొడుకు పోయాడు. మాకు మైల. పైగా మేము ఊరు వెళ్ళాలి. మీ దారి మీరు చూసుకోండని చెప్పాను. ఆ పళంగా వెళ్ళిపోయారు.

రామా: ఇదేం అఘాయిత్యమే. చావు కబురు కల్పించి బంధువులని సాగనంపుతావటే. ఎంత తప్పు! ఎంత తప్పు!

సీతా: తప్పేమిటండి! మామగారికి పినతండ్రీ లేడు. పినతండ్రికి కొడుకూ లేడు. లేనివాళ్ళు చచ్చారంటే మరేమీ తప్పులేదు. లెండి. లెండి. భోజనానికి లెండి. నాకు నీతులు చెప్పొచ్చారు.

---

## 3వ రంగం

[వీధిలో]

విరం: అనంతబుద్ధీ! ఇంతపని జరుగుతుందనుకోలేదోయి. రెండు నెలల నుంచి నిరాఘాటంగా జరిగిపోతూంది యీ గ్రామంలో భుక్తి. ఈ నాటికి సీతమ్మగారు నాకు స్వస్తి చెప్పింది!

అనం: ఆవిడ చాలా దేవాంతకురాలిలా కనిపిస్తోందండి. నేను మొదట్లో ఏమిటో అనుకున్నానుగాని.

నిరం: సమయానికి రామాశాస్త్రులగారు లేకపోయారు. ఉంటే యింతా కొంతకాలం గడిపేది. 'మా పెద్ద' మనిషి రామాశాస్త్రి మాత్రం.

అనం: ఆయనకు తగినభార్య దొరికలేదండి. అదే నా విచారం. అయితే యిందానికేంగాని, భాగోతులపల్లి వెళదామంటారా?

నిరం: సీతమ్మగారిముందు అల్లాగనకపోతే బాగుండదని అన్నానుగాని. వెడితే మనకి దిక్కేవరోయి అక్కడ.

అనం: అలాగాండి. మీరెరిగిన బంధువులెవరైనా వున్నారేమో అనుకుం టున్నాను.

నిరం: సరేకాని. అనంతబుద్ధి! మన భండారుపురంవెళ్ళి అక్కడ కొన్నాళ్లు హరికథాకాలక్షేపంచేస్తే కృష్ణశర్మగారు సంతోషిస్తారు. వెడదా మటోయి.

అనం: మీరు వెడితే వెళ్ళండిగాని. నాకు ఇప్పుడు రావడానికి తీరికలేదు.

నిరం: పోనీ మీ యిల్లెక్కడ? మీరు వచ్చేలోగా మీ యింట్లో వుండి మీ రాకకు ఎదురు చూస్తుంటాను.

అనం: నాకు యిల్లంటూ వుండేకదండి! భండారుపురంలాంటి మహా పట్నంలో యిల్లెక్కడ దొరుకుతుందండి. నాకు బంధువులంటే మహా చెడ్డ అభిమానం. కొన్నాళ్లువుండకొని ఆదరిద్దామన్నా, ఒక అద్దెకొంపైనాలేదు. అందుచేత బంధువు లెవరూ మా యింటికిరారు.

నిరం; పోనీ నా సంగతికేంగాని. మీ భార్యాబిడ్డలు ఎక్కడ వుంటున్నా రోయి?

**అనం:** మా మామగారింట్లో పెగబెట్టాను భండారుపురంలో. నే నెప్పుడైనా అక్కడకు వెడితే మా మామగారింట్లోనే బస.

**విరం:** అల్లాగా! పోనీ. మీ మామగారికి ఒక ఉత్తరం ముక్కరాసియ్యవోయి. వారి సహాయంతో నేను జయప్రదంగా కొన్నాళ్లు హరికథా కాలక్షేపం చేసుకుంటానకున్నాను.

**అనం:** మా మామగారు ఆయన మామగారిపై ఆధారపడివున్నారు. మా మామగారికి ప్రత్యేకం ఉద్యోగంలేదు. నాలాగే ఆహారసేకరణ తప్ప. మామామగారి మామగారే యీవంశాన్నంతా భరిస్తున్నారు.

**విరం:** అయితే నీకు వుద్యోగంలేదూ ? ఏదో ఆహారసేకరణ డిపార్టుమెంటులో పని అన్నావు గదయ్యా!

**అనం:** రామావధాన్లుగారితో అల్లా అనకపోతే బాగుండదని అన్నాను. ఉద్యోగంవుంటే యిన్ని వూళ్ళు తిరగడమెందుకండి? ఉద్యోగ సంపాదనకోసమే యీ ప్రయత్నమంతా. ఈ ప్రయత్నంలో నేను ప్రతిరోజు ఆహారసేకరణ సమస్య పరిష్కరిస్తూ వుండాలి.

**విరం:** మహా ఘటికుడవోయి. నేను యింకా నీతో భండారుపురం వచ్చి నీతో కొన్నాళ్లు అక్కడ వుందామనుకుంటున్నాను.

**అనం:** నాకు నిజంగా మిమ్మల్ని చూసినప్పటినుంచి ఎంతో బంధు అభిమానమంటె నమ్మండి, కాని పరిస్థితులు యిల్లామండిపోతున్నాయి. మా తాతాగారి నెరగరూ! సూరయ్యగారు. ఆయన నిరతాన్నప్రదాతలుగా! నిత్యం వారి యింట్లో అధమం ఒక పాతిక విస్తళ్ళు అతిథులకు వేయవలసిందే.

**విరం:** అల్లాగటోయి! మీ తాతగారు చాలా గొప్పవారన్నమాట.

ఆనం: సరేనండి. అయితే దాసుగారూ! యింతకీ తమ స్వస్థలం ఏప్రాంతం?

నిరం: నాకు ఒక ఊరంటూ లేదోయ్. చిన్నప్పటినుంచి నాకు యీ హరి కథా కాలక్షేపం. ఏదో ఆ పరమాత్మని ధ్యానించుకోవడంతో జీవితం గడిచిపోతూంది. కాని నేను పుట్టినవూరు తెనిపాడు

ఆనం: మీ భార్యాపిల్లలు తెనిపాడులో వున్నారన్నమాట.

నిరం: నాకు భార్యాలేదు. పిల్లలూ లేరు. నేను ఒంటిగాణ్ణి.

ఆనం: అయ్యయ్యో! పాపం! మరి పెళ్ళిచేసుకోలేదాండి!

నిరం: పెళ్ళికోసమేనోయ్ యీ ప్రయత్నమంతా. ఏదో హరికథలు చెప్పి నాలుగురాళ్లు వెనక వేసుకుంటున్నా.

ఆనం: అలాగటండి. నేను యింకా ఒకసారి మీ వూరువచ్చి మీ భార్యా పిల్లల్నిచూచి, కొన్నాళ్లు అక్కడవుండి, ఆహారసేకరణ విషయము తనిఖీ చేద్దామనుకుంటున్నాను.

నిరం: అంతేలెండి! గీతలో చెప్పాడు అంతా యోగం అని. యోగం వుంటేగాని ఏ పని చేయలేం.

ఆనం: భాగోతులపల్లి వెళ్ళడం మానేసినట్లేనాండి.

నిరం: వెడితే అక్కడ మనల్ని ఎరిగినవారెవరు? ఎవరైనా కాస్త ఎరిగిన వాళ్లుంటే కొంత కాలక్షేపం.

ఆనం: సరేనండి! మరి నాకు సెలవిప్పిస్తారా? నా దారి నే చూసుకుంటా! నమస్కారం.

నిరం: వెళ్ళిరా నాయనా! నిరంజనార్పణమస్తు!

---

పాత్రలు:

సిద్ధాంతి: లావుగా పొడుగా వుంటాడు. ఒళ్ళంతా [illegible] అతడు పచ్చ [illegible] పక్షంపై కప్పుకుంటాడు. ముక్కుమీద గుంటు, [illegible]. ఇతనిలో స్వార్థంపాలు ఉపయోగించే తెలివితేటలు జాస్తి. వయస్సు నలభైపైన.

గంగాధరం: తాలూకా ఆఫీసులో గుమాస్తా. ఉద్యోగం దొరికాక సంసారంతో కాపురం చేసుకుందామని యిల్లు వెతుకుతుంటాడు, అమాయకుడు కాకపోయిన పెద్ద తెలివైన ఘటం కాదు, వయస్సు ముప్పైఐదు.

మల్లయ్య: పోలీసు. సిద్ధాంతిగారికి కొంచెం పరిచితుడు.

## 1వ రంగము

[మార్చి 30వతేది. గంగాధరం సిద్ధాంతి యింటికి వస్తాడు. సిద్ధాంతి పంచాంగాలు పరికిస్తుంటాడు]

గం: సిద్ధాంతిగారూ: మన యిల్లుగాని ఖాళీగా వుందాండి.

సి: అవేంకూతలయ్యా! ఇంతమంది జనాన్ని మసలుడంచూస్తూ యిల్లు ఖాళీగావుంచా అంటావేమిటి? ఎడారిలా ఖాళీ అయిపోవాలని కోరుతున్నావా?

గం: తమరు తప్పుగా భావిస్తున్నారు నా మాటను. తమరింట్లో ఏదైనా ఒక భాగం అద్దెకుందా అని నా వుద్దేశ్యం.

సి: అల్లా సూటిగా అడుగుతే బాగుండేదిగా! ద్వంద్వార్థాలతో కూడిన ఈ కవిత్వ మెందుకు మొదట! అయితే ఎంతలోకావాలి తమరికి!

గం: ఇంతకీ మీ యింట్లో భాగం ఎంతలో వుందండి!

సి: అదుగో! అలాంటి వితండప్రశ్నలే నాకు పనికిరావు. మాయింట్లో భాగం నూరు రూపాయిలకి యిస్తానంటాను. రెండు వందలరూపాయలకి యిస్తానంటాను. తమరు యిచ్చుకోగలరా!

గం: అంతంత అద్దెలు నేను మాత్రం యిచ్చుకోలేనండి.

సి: ఏఏ. మరి యింకేం! తమరికి ఎంతకావాలో యిప్పుడైనా చెప్పండి!

గం: ఏదో ముప్పయి, ముప్పయి ఐదు రూపాయిలకయితే యిచ్చుకోగలను.

సి: మా యింట్లో భాగం యించుమించు అంతలోనే వుందిలెండి! (నవ్వుతూ) రండి. రండి లోపలికిరండి! పాపం! యిందాకటినుంచి బయటనే నుంచున్నారు....చూశారు! యీ యిల్లు నా స్వార్జితం. చెమటూడ్చి కట్టానండి, ఈ మధ్యనే. నేను చెప్పుకోకూడదు కానండి! "సిద్ధాంతిగారియిల్లు యిసప్పెట్టె" అంటారు అందరు.... చూడండి! యిది క్రిందిభాగం. ఆరుగదులు. పైనకూడ అంతేనండి.

గం: మీ యిల్లు అంతా చాల బాగుందండి. ఇంతకి అద్దెకిచ్చేభాగం చూపిస్తారు!

సి: నేనూ అదే చూపిస్తున్నానండి. చూశారూ! యీ కుడిభాగంలోని రెండు గదులు అద్దెకు యిద్దామనుకుంటున్నాను. ఇవి అద్దెకు తీసుకున్నవాళ్లు కావాలంటే ఆ ప్రక్కనేవున్న వరండాకూడా వాడుకోవచ్చు. ఈ రెండుగదుల్లో అలమరులున్నాయి, అటకలున్నాయి. మీరు కావలసినంత సామాను వీటినిండా పెట్టుకోవచ్చు.

గం: చిత్తం.

సి: దొడ్లో మయ్యి వుంది, నీళ్లుచక్కగా కొంకాయనీళ్ళలా వుంటాయి.

ప్రతి వాటావాళ్ళకు కేటాయింపుగా ఒక పాయిఖానా వుంది. అంద రికీ నీళ్ళగది ఒకటే వుంది.

సిద్ధాంతిగారూ! ఇంత చక్కటి యిల్లు కట్టారుకదా. ఇంకా యింట్లో విద్యుద్దీపాలు కుళాయి పెట్టించుకోలేదేమండి.

నేనూ అదే ప్రయత్నం చేస్తున్నానండి. దానికీ కాలమనేది రావాలి కదండి. అంతా పరమేశ్వరేచ్ఛ. మనం చేద్దామనుకుంటేమాత్రం ఆ పరమేశ్వరుడు తోడ్పడందే ఏం చెయ్యగలం? ఏమంటారు?... యింట్లో ఆర్థిక పరిస్థితులు కొంచెం క్లిష్టంగా వున్నాయి. అందు చేత ఈ ఆలస్యం.

సాధారణంగా ప్రతి గృహస్థుడికీ యిటువంటి యిబ్బందులు మామూలే లెండి:

చూశారు! యీ యిల్లు కట్టాక కొంచెం డబ్బు యిబ్బంది మరీ ఎక్కువైపోయింది. ఇల్లు నాల్గు వాటాలవాళ్ళకి అద్దెకుయిచ్చి క్రమంగా తక్కిన సదుపాయాలు కూడా చేయిద్దామనుకుంటున్నాను.

మేడమీద భాగంకూడ అద్దెకు యిస్తారాండి?

లేదండి! అందులో అప్పుడే యిద్దరు వాటాలవారున్నారు. క్రింద భాగంలో ఒకవైపు నేనుంటాను. క్రింద మిగిలిన రెండు గదులు అద్దెకు యిద్దామని ఇప్పుడు ప్రయత్నం.

ఇంతకీ అద్దె ఎంతో సెలవిచ్చారుకాదు.

అద్దె అంత ఎక్కువ కాదనుకోండి. నలభై ఐదు రూపాయలు మాత్రమే.

నలభై ఐదు రూపాయలే యీ రెండుగదులకి! పైగా కుళాయిలేదు-

విద్యుద్దీపాలు లేవు. ముప్పైఐదు రూపాయలు యిచ్చుకోవడమే నాకు బ్రహ్మాండమైతే ఇంత అద్దె నే నెక్కడ యిచ్చుకోగలనండి ఆయితే, మరి సెలవు. వెడతానండి.

పి: ఆఁఆఁ. అల్లా వెళ్ళిపోతారేమిటి! కొంచెం శాంతంగా - మాట్లాడకుండా.

గం: మరి ఏం చెయ్యమంటారు. అద్దె వినేటప్పటికి నా గుండె గుభేలుమంది. ఇంకా ఇచ్చుకోవలసివస్తే చెప్పాలా మాలాంటి సామాన్య గృహస్థుల పరిస్థితి.

పి: పోని మీరు కాబట్టి ఒక్క రెండు రూపాయలు తగ్గిస్తానులెండి.

గం: నేను ముప్పయి ఐదు రూపాయలుదాటి యిచ్చుకోలేనండి. మీకిష్టమైన అంతకివ్వండి. లేకపోతే లేదు.

పి: ఇటువంటి విషయాలలో అంత మొండితనంకూడదు. పోనీ నలభై రూపాయలకు తీసుకోండి.

గం: నలభై రూపాయలు ఇంటి అద్దెయిచ్చుకుంటే మరి నేను తినేదేమిటి ఈ కరువురోజుల్లో. సెలవిప్పించండి పోయివస్తా.

పి: ఇంటికివచ్చినవాళ్ళని రిక్తహస్తాలతో పంపించడం నా మతంకాదు. పోనీలెండి! మీరన్నమాట నేనెందుకు కాదనాలి,

గం: అయితే, ముప్పయిఐదురూపాయలకు ఖాయమేనాండి!

పి: మీ యిష్టమే నా ఇష్టం.

గం: మరి. ఇల్లు ప్రవేశించడానికి మంచిరోజుకూడ సెలవిస్తే ఆ నాడు గృహప్రవేశం చేస్తా.

గం: మరి సెలవాండి! వస్తాను.

సి: మంచిది చూశారు! ఒక్కమాట. అయితే ఎంతమంది జనంతో గృహప్రవేశం చేసేది చెప్పారుకాదు.

గం: నా భార్యా, యిద్దరు బిడ్డలు, నేనూ, మా అమ్మ మొత్తం ఐదుగురు మనుష్యులం.

సి: సరేలెండి! ఐదుగురు మనుష్యులు రెండుగదుల్లో నివసించడం ఆరోగ్యానికి అంత మంచిది కాదుకాని మాట యిచ్చిన తర్వాత మళ్లీ తిరగడం, నా తత్వంకాదు. సరే! రేపు పంచమి. వచ్చి గృహ ప్రవేశం చేయించండి.

గం: చిత్తం. [ నిష్క్రమణ ]

---

## 2వ రంగం

[15 ఏప్రిల్ వరాండాలో గంగాధరం, సిద్ధాంతి]

సి: గంగాధరంగారూ! యిప్పుడేనా ఆఫీసునుంచి వస్తా! పాపం చాల శ్రమపడ్తున్నారు.

గం: మరేనండి! పగలల్లా పనిచేసి యింటికి వచ్చేటప్పటికి నవనాడులు క్రుంగిపోతాయండి.

సి: మీకు మాయిల్లు అనుకూలంగా వుందనుకుంటాను. మీకు ఏవైనా సౌకర్యాలు కావలిస్తే. నాతో చెపితే క్షణంలో చేయిస్తాను.

గం: చాల సంతోషం. మీరు నాయందు ప్రత్యేక అభిమానం చూపుతున్నారు.

గం: దీనికి పెద్ద ఆలోచన ఎందుకుగాని. మీరు చెప్పినమాటకూడా 'సమం జసమే. అయినా చూద్దాములెండి.

సి: నేను కోరేది ఐదారునెలలఅద్దె ముందు యిప్పించమని. నాకు మీరు సహాయం చేసినట్టూ వుంటుంది. మీకు నేను సదుపాయాలు అమర్చి నట్టూ వుంటుంది.

గం: సరేలెండి. ప్రస్తుతం రెండువందల రూపాయలు యిస్తే చాలాండీ?

సి: మీ యిష్టం. మిమ్మల్ని ఎక్కువ ఇమ్మనడంకూడ భావ్యంకాదు.

గం: రేపు బ్యాంకులోంచితీసి యిల్లో యిస్తాను. సరుకు తీసుకోండి.

ఆ మాత్రం సహాయబుద్ధి మీ ఒక్కరిలో కనిపించిందంటే నమ్మండి. మాకాయా, గంగాధరంగారూ! పైనున్నవాళ్ళకి యిల్లు యిచ్చాగానండి. ఇప్పుడు యెందుకు యిచ్చానా అనిపిస్తుంది. ఏదో వల్లరు మనవాళ్ళనేవాళ్ళ యింటనిండావుంటే యిల్లు కలకలలాడు తుందని కదాండి అద్దెకిచ్చేది. వాళ్ళల్లో కలుగోలుపుతనమూ లేదు మంచి మర్యాద అసలేలేదు.

గం: అల్లాగాండి!

సి: మనుష్యులు శాశ్వతంకాదు కాని. అన్నమాటలు, చేసిన చేష్టలు లోకంలో నిలిచిపోతాయి, మీరు యిప్పుడు యీ సహాయంచేశారా, ఇంక మా యింట్లో దీపాలు, కళాయి చూసేటప్పుడల్లా మీరు యీ యింట్లోంచి యెప్పుడైనా యే కారణంచేతనైనా వెళ్ళిపోయినప్ప టికీ. మీ పేరు చిరస్మరణీయంగా వుంటుంది. మంచి అంటే అలా వుండాలి.

గం: మీరు అనవసరంగా నన్ను పెద్దచేస్తున్నారు.

సి: చూశారూ! గంగాధరంగారూ! నా ఉద్దేశ్యంలో యీ డబ్బు శాశ్వతం కాదు. మాట ఖరారుండాలి. మనిషికి పెద్దమనిషితనం ముఖ్యం. నేను ఈ వెధవడబ్బుకోసం కాదండి యిల్లు అద్దెకిచ్చేంది. నలుగురు పెద్దమనుష్యుల స్నేహంకోసం. ఈ పట్నవాసంలో చూశారూ! ఎంతమంది ఇల్లు దొరక్క యిబ్బంది పడుతుంటారో! ఇల్లు అద్దెకిస్తే యిల్లులేనివాళ్ళకు యిల్లు యిచ్చినట్టూ వుంటుంది. మనకు మంచివాళ్ళ స్నేహం అయినట్టూ వుంటుంది.

గం: మీ మాటల్లో చాల నిజం వుందండి.

సి: ఆఁ....ఏమండి! ఆ గోడలనిండా మరకలేమిటి? అయ్యయ్యో! పెళ్లలు కూడా ఊడిపోయాయే! గంగాధరంగారూ! మీ పిల్లలిలాగుంటే పాడుచేస్తా. ఈ మధ్యనే వెల్లలు, రంగులు వేయించాను బోలెడు డబ్బుఖర్చుపెట్టి. కొంచెం జాగ్రత్త సుమండి! ఇల్లంటే అదేమిటో కొంచం నాకు ప్రాణప్రదం.

గం: అది సహజంలెండి! కష్టార్జితంతో యిల్లు కట్టినవాళ్ళకి.

సి: మరేనండి! చూశారూ మీ పిల్లలు తెలియక దొడ్లో ఆటలాడి మొక్కలు పాడుచేయడం, పూలుకోసేయడంకూడా చేస్తున్నారట. కొంచం జాగ్రత్త సుమండీ.

గం: అల్లాగేలెండి! ఇంట్లో మా వాళ్ళతోచెప్పి పిల్లల్ని కూకలేయిస్తాను.

సి: మరోవిధంగా అనుకోవద్దు, నా కోరిక ఏమిటంటే మనంవుంటున్న యిల్లు అందంగా శుభ్రంగా వుండాలని, అందుచేత మరీ మరీ చెపుతున్నా ఈ విషయంలో.

గం: తప్పకుండానండి సిద్ధాంతిగారూ! అలాగే చేద్దాము.

సీ: పాపం! మీకు చాల శ్రమ యిచ్చాను. భోజనాలవేళయిందేమో! భోంచెయ్యండి! నేనూ లోపలికి వెడతా!

గం: మంచిదండి!

---

# 3వ రంగము

[ మే 1వతేది, గంగాధరం సిద్ధాంతి ]

సీ: గంగాధరంగారూ! మీతో చెప్పదామనుకుంటూనే ఎప్పటికప్పుడు మరిచిపోతున్నా. చూశారూ! మీరిచ్చిన రొక్కం అన్నింటికీ సరిపోయింది. ఈ నెల అద్దె యిప్పిస్తారా!

గం: ఇదేమిటండి! నేనిచ్చిన డబ్బంతా అన్నింటికే సరిపోవడమేమిటి? ఐదారు నెలలదాకా అద్దెఅడగనంటేకదా, నేను మీకు రెండువందల రూపాయలు యిచ్చినది. మళ్ళా ఈ నెల అద్దె అడుగుతున్నారేమిటి?

సీ: ఇదిగో బిల్లు. ఇదిచూస్తే మీకన్నీ తెలుస్తాయి. మీరిచ్చిన రెండు వందల్లో మూడునెలల అద్దె డిపోజిట్టుగా వుంచాను. ఇల్లు వాడుకుంటున్నందుకు ప్రతిచోట మామూలు. కావలిస్తే మీరు వాకబు చేయించండి. మూడు నెలల అద్దె డిపోజిట్టు క్రింద నూటయిరవై రూపాయలు అయినాయి. ఈ రూపాయలు మీరు యెప్పుడు యింట్లోంచి వెళ్ళిపోతే అప్పుడు తీసుకు వెళ్ళవచ్చు.

గం: నెల అద్దె ముప్పయిఐదు రూపాయలన్నారు కదా? మూడు నెలల అద్దె నూటయిరవై రూపాయలు డిపోజిట్టు ఎల్లా అయిందండి?

సీ: యింటి అద్దె ముప్పయిఐదు రూపాయలే. నేను అబద్ధం ఆడే మని

షిని కావలండోయి. కాని పాకీవానికి ఒక్క రూపాయి, కుళాయి నీళ్ళకు రెండు రూపాయలు, దీపాలకు రెండు రూపాయలు ప్రతి నెల యిచ్చుకోవద్దూ! కుళాయి దీపాలూ, పాయిఖానా, ఊరకేవాడు కుంటారటండీ మరి. ఇది అంతా సమ్మలక్రిందే పోతుంది. నాకు ఒక్కపైసా రాదు. అందుచేత యింటిఅద్దె ముప్పయియిదు రూపాయలు చిల్లరఖర్చులు ఐదు రూపాయలు మొత్తం నలభై రూపాయలు, యివ్వాలి నెలకు.

గం: ఈ సంగతి మొదట యింట్లో ప్రవేశించేటప్పుడు ఎందుకు చెప్పలేదండి!

సి: అది నేను చెప్పాలా! అద్దెయింట్లో కాపురం చేసేవారు మీకు తెలియదూ! కావలిస్తే మీరు దర్యాప్తు చేసుకోండి ఈ పద్ధతిగురించి.

గం: అయితే ఆ రెండు వందల్లో మిక్కిన నలభై ఏమయ్యాయి.

సి: వినండి! అంత కంగారెందుకు! క్రిందటి నెల అద్దెక్రింద నలభై రూపాయలు తీసుకున్నాను. మిగిలిన నలభై రూపాయిలలో ఒక యిరవై రూపాయలు కుళాయివాడకానిక్కి డిపోజిట్టు. ఇంకో యిరవై రూపాయలు దీపాలకి డిపోజిట్టు.

గం: ఇదెక్కడి దారుణమండి! మీ యింట్లో ఏదైనా క్రొత్తగాచేయించుకుంటే, దాని ఖర్చు అద్దెవాళ్ళ నెత్తినికూడ పడ్తారా!

సి: ఈ డిపోజిట్టులో ఒక పైసా పోదు. మీరు వెళ్ళిపోయేటప్పుడు మీ డిపోజిట్లు తీసుకపోవచ్చు. కాని వాడుకునేవస్తువులు సరిగ్గా వుండేటట్టు మాత్రం చూడాలి.

గం: యీ నిబంధనలన్నీ మొదట నాతో ఎందుకు చెప్పలేదండి!

సి: ఈ విషయాలు మీతో చెప్పాలటండి! మీకు తెలియద్దూ యిన్ని అద్దె యిళ్ళలో కాపురముంచేవాళ్ళు, మొదట మీరే ఈ విషయాలు పెద్ద మనిషిలా చెప్తారేమో అని చూశాను. మరి యిక ఎంత కాలము ఆగగలను! ఇంతకీ యిది నా ఇల్లాయె! మీకేం. చక్కగా వాడుకు పోతారు. తరువాత బాగులు చేయించుకొని అనుభవించేవాణ్ణి నేనుగా

గం: ఇలాంటి అఘాయిత్యాలు చేస్తారని అనుకోలేదండి సిద్ధాంతిగారూ! మిమ్ము చాల పెద్దమనుష్యులనుకున్నాను గాని....

సి: ఏమయ్యోయి! మాటలు జోరుగా రానిస్తున్నావు. ఏమిటి అఘాయిత్యం అంటున్నావు. ఇన్నాళ్లు డిపాజిట్లు తీసుకోమనకుండా ఊరుకుని మోసం చెయ్యటమే కాకుండా, యీ కొరుకూతలేమిటి?

గం: సిద్ధాంతిగారూ! మంచి మర్యాద తెలుసుకుని మాట్లాడండి. అయితే నేను ఇల్లు ఖాయంచేసుకున్న రోజున ఇచ్చిన పదిరూపాయలు ఏం చేశారు?

సి: ఏమండోయి! ఇంటి అద్దె ఇండియానాణెంలో యివ్వాలి. హైద్రాబాదు నాణెంకాదు. మీరు నాకిచ్చిన రెండువందల పది రూపాయలు హైదరాబాదు నాణెం. ఇండియా నాణెంలో లెక్కవేస్తే మీరు తిరిగి నాకే యింక చాల బాకి.

గం: ఇదేం ఘోరమయ్యా సిద్ధాంతిగారూ! ఈ సంగతులన్నీ నేను ఇంట్లో ప్రవేశించేముందు ఎందుకు చెప్పలేదు.

సి: బాల్లేవయ్యా! చీటికి మాటికి "ముందు ఎందుకు చెప్పలేదంటావు" ఆ మాత్రం తెలియని కుర్రకుంకవా! చెట్టంత ఎదిగిన పెద్ద మనిషివాయము!

గం: హయ్యో! రామచంద్రా! ఇంతంత దుండగాలుచేసే వాళ్ళులని తెలిస్తే ఈ కొంపలో అడుగుపెట్టకపోదును. ఈ కొంపలో ఇంక ఒక్క క్షణం వుండను. నా డిపాజిట్లు నా కిచ్చేయండి. తక్షణం ఈ వేళే నా ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోతాను.

సి: పోవయ్యా తక్షణం పో! ఇంట్లోకి ఎవరురాకున్నట్లు కట్టేస్తున్నావే! ఓ! నీలాంటి వాళ్ళని చాలమందిని చూశాను.

గం: చాల్లేవయ్యా! గణించావు ఎల్లాగయితేనే ఒక కొంప!

సి: గంగాధరంగారూ! మర్యాదగా మాట్లాడండి. కొంప కొంప అంటా రేమిటి! వెయ్యాల కొంపకి మల్లే! ఇల్లు అనలేవటయ్యా! నాలికపో శని వుందా!

గం: ఇలాంటి వెధవ యింటిలో ప్రవేశించడం నా తప్పుకాని మిమ్మల్ని అనవలసిన పని లేదు.

సి: ఏమయ్యోయ్! మాటలు మాత్రం జాగ్రత్తగా రానీయ్! వెధవ అంటా వేమిటి! నువ్వే వెధవ్వు! నీ ఆవిడ విధవ! మీ వాళ్ళంతా వెధవలు.

గం: చాల చక్కగావున్నాయి. సిద్ధాంతిగారూ మీ మాటలు! మీతో దెబ్బలాట నా కెందుకుగాని! నా డిపోజిట్లు తక్షణం యిచ్చేయండి! తక్షణం లేచిపోతా యింట్లోంచి.

సి: పోవయ్యా! పోతానని బెదరిస్తే వుంచమని బ్రతిమాలుతా వను కున్నావా! నీ డబ్బులు నా దగ్గర వుండకపోయ్! ఓ! తక్షణం దయ చెయ్యండి యింట్లోంచి. కావలిస్తే యింట్లో సామాను బయటపారే యడానికి సహాయంకూడ చేస్తా!

గం: నా డిపాజిట్లు నా కివ్వండి.

సీ: ఆగవోయ్! నా పీపాలు. కుళాయి. యిల్లు సరిగా వుందో లేదో చూసుకోనీ! (కొన్నిపాగి) అం. అయ్యయ్యో! ఆ గోడనిండా మరకలేమిటండీ! తెల్లని వెల్లలన్నీ కాయనలుపెక్కి పోయాయె. తలుపుల రంగులు యిలాపోయాయేమండీ! గోడల వెల్లలు చాల ఊడి పోయాయె!

గం: ఏముందోయ్! కాస్తవున్నది గంపంత చెయ్యకండి! నెల్లాళ్ళు ఇంట్లో వున్నప్పుడు ఒక పెన్సిలుగీత, ఒక మరక వుండవా!

సీ: చాల్లేవయ్యా! ఇంట్లో అద్దెకున్నవాళ్ళంతా ఇలాగే చేస్తున్నారా? అయ్యయ్యో! దొడ్లో ఇన్ని మొక్కలు మాడిపోయాయేం! ఏమయ్యా గంగాధరంగారూ! నీకు ఎన్నోసార్లు చెప్పాను. పిల్లల్ని పాడు చేతులతో ఈ చక్కటి పూలమొక్కల్ని తాకనీయవద్దని! ఈ మొక్కల్ని యిలా మాపేసేరా! దీనికి ఎంత విలువయిస్తే మాత్రం చాలుతుందయ్యా!

గం: ఏముందోయ్! ఈ మొక్కలు ఎండకు ఎండిపోయాయి. నా కుర్రాళ్ళు ఏమీ చెయ్యలేదు,

సీ: చేసినతప్పు సమర్థించుకో చూస్తున్నావూ! చాల్లేవయ్యా! అదేమిట్రా ఆ కుళాయినీరు ఇంత సన్నంగా పడుతోంది. మొదటిలో ధార చాల లావుగా వుండేదే! నేను ఎప్పుడో అనుకున్నాను. పిల్లల్ని ఇలా కయ్యంపెట్టి కుళాయి పాడుచేసి పోతారని! అశుద్ధమైన చేతులూ ఆ కుళాయిమీదవేస్తే పాడవదూ! కుట్టుకుంకలకుకూడ ఈ కుళాయే నాంట! ఏమయ్యా గంధరంగారూ! దీనికి మీ సమాధానం ఏమిటి?

గం: కుళాయిధార మొదటినుంచీ యిలాగే వుంది. నా దగ్గర దొంకకండి!

ఈ మోసమంతా! ఇన్నీ శ్రీరంగనీతులు చెప్పిన పెద్దమనిషివి ఇట్టయ్యా నీ తెలివితేటలు!

సి: ఇదిగో చెపుతున్నా గంగాధరం! పై యిరవైయైదురూపాయలు యిక్కడ పెట్టి తక్షణం యింట్లోంచిపో, నీలాంటి రౌడీల యింట్లోకి రానివ్వడం నా బుద్ధి తక్కువ.

గం: ఇంక మార్గమేమిటి మీరు చేసే దారుణాన్కి మిమ్మల్ని ఏం చేయాలో నా కర్థం కావటంలేదు.

సి: ఇంకో యిరవై రూపాయలు అక్కడ పెట్టండి. లేకపోతే పోలీసుల్ని పిలవమన్నారా? ఆ మొగలోవున్న పోలీసుల్ని పిలుస్తేగాని మీపని కాదు. ఏయ్! పోలీసు మల్లయ్యా (చప్పట్లతో) ఏ.మల్లయ్యా! ఏమిటనుకున్నావయ్యా! ఇక్కడ నాదిస్థానబలిమి. బయట ఎక్కడ నుంచో వచ్చి నన్ను డబాయిద్దామనుకుంటున్నావా?

మ: ఏమిటండి సిద్ధాంతిగోరూ! సంగతీ!

సి: చూడు మల్లయ్యా! ఈయన ఇవ్వవలసిన అద్దె ఎగగొట్టి ఇంట్లో వస్తువులన్నీ పాడుచేసి, యిల్లు ఖాళీచేసిపోతున్నాడు. రిపోర్టు రాసుకో!

మ: నీ పేరేమిటయ్యా!

గం: సిద్ధాంతిగారూ! ఇదేమి దారుణమయ్యా! నా డబ్బు తినెయ్యడమే కాకుండా, ఈ బాకీ, పోలీసు రిపోర్టుకూడా ఏమిటి?

సి: చాల్లే తగ్గవయ్యా! మల్లయ్య రాసుకో! నే చెపుతాను. ఇతని పేరు గంగాధరం. తాలూకాఫీసులో గుమస్తా! ఇతని గురించి తనఖీ చెయ్యి. తనఖీ చెయ్యకపోయినా ఫరవాలేదుగాని, తక్షణం ఈయన.

సామాను బయట పారేసి ఇంట్లోంచి పొమ్మను. ఇటువంటి వెధవలతో ఇరవై రూపాయలకు దెబ్బలాడటం నా పెద్దమనిషి తనానికి లోపం. వీడు ఇంట్లోంచి పోతేసరి. శని విరగడవుతుంది. పంపించేయి. మల్లయ్యా యింకా చూస్తావేమిటి!

[మల్లయ్య సామాను బయట పారేస్తాడు. సామాను చప్పుళ్లు]

గం: (ఆయాసంతో ఏం చెయ్యలేక) సిద్ధాంతిగారూ! ఇంతటితో నెగ్గారనుకోకండి! మీ సంగతి ఏమవుతుందో చూడండి ముందుముందు.

సి: పోవోయి ఈ ఘటికుణ్ణి నువ్వా బెదిరించేది? హహ.... యిదిగో! మల్లయ్యా ఈ రూపాయి తీసుకో సిద్ధాంతిగారికి సేవ చేసినందుకు!

మ: సిద్ధాంతంగోరు ఎంతో మంచోరు. దణ్ణమయ్యా దొరా ఎడతాను.

సి: వెళ్ళరా మల్లయ్యా! పాపం! చాల శ్రమపడ్డావు! చూడు వీడిని ఒక కంటితో జాగ్రత్తగా కనిపెట్టుతూ వుండు సుమీ.

మ: సిత్తం. (విష్క్రమణ)